


ప్రకాశకుడు:

గొల్లపూడి వీరాస్వామి,

శ్రీ సీతారామా బుక్కు డిపో,

రాజమండ్రి.




Printed at SCAPE & Co., COCANADA.







# సురానంద

ప్రకాశకుడు:
గొల్లపూడి వీరాస్వామి,
శ్రీ సీతారామా బుక్కు డిపో,
రాజమండ్రి.




Printed at SCAPE & Co., COCANADA.
1926.



[Price Re. 1.

# చతురిక

గ్రంథకర్త:—సహదేవ సూర్యప్రకాశరావు.

ఇది స్వకపోలకల్పితమగు నపరాధ పరిశోధకనవల. ఇట్టినవలా శిరోమణి మనయాంధ్రదేశమున నుద్భవించ లేదు.

చతురిక చేయు ఘోరకృత్యములు హృదయవిదారకములు. పన్నిన పన్నుగడలు వాగతీతములు. అనంతునియొక్క పూర్వచరిత్రము పుస్తక పఠనము పూర్తిచేయువరకుఁ దెలియదు. చతురిక సదనమున జరిగిన హత్యయు, చతురిక తన యభిచరుల కారాగారమునం దుండువారిని దప్పింప నెంచి కుడ్యాగ్రమున నిలువఁబడి పారాకాయు వానిఁజంపినదియు, కోటిలింగాలయగర్భమున ఈశ్వరసమ్ముఖమున జరిగిన హత్యయు, కట్టెదుట గన్పట్టుచున్నట్లుండి యెట్టి గుండె నిబ్బరము గల వారినైనను భయకంపితగాత్రులను జేయకమానవు.

చతురిక దారుణ భీషణాగ్నిజ్వాలలంబడి పోవ పాఠకుని కాయము జలదరింపక మానదు.

నిరూపకుఁడగు శ్రీనివాసుని నిరూపణాశక్తి, ధైర్యము, కృతక వేషధారణ మత్యద్భుతము. పత్తేదారున కపరిచితుఁడు వ్రాసినభయంకరలేఖలను పఠించినచో శరీరము గగుర్పాటొందక మానదు. చతురిక రహస్యాపరాధ పరిశోధకాధ్యక్షుని బంధించి వాతెంపుసరపించుకొని పోవుట చిత్రముగా వర్ణింపఁబడినది. హంతకుల యాంత్రికతంత్రనిర్మాణములను భేదించి, ఈనవలయందు నొక్కొక్క ప్రకరణమునం దొక్కొక్కరసము చిప్పిలుచుండును. ఈనవలారాజము నెన్ని సారులు చదివినను తనివితీరదను మాట యతిశయోక్తి కానేరదు. పలుమాటలేల? నేఁడే మాకార్యస్థానమునకు వ్రాసి చతురికను దెప్పించుకొని మావ్రాతల యథార్థము నరయుఁడు. వెల రు. 1-0-0




శ్రీ సంపూర్ణ రామాయణ పాదుకాపట్టాభిషేక, తులసీదాసు
శారద సంపూర్ణాంజనేయనాటకేత్యాది
నాటకములు రచియించిన [illegible]

గ్రంథకర్త:

# కె. యస్. నారాయణ [illegible]


ప్రకాశకులు:

[illegible]

శ్రీ సీతారామా బుక్కుడిపో, రాజమండ్రి.

రెండవకూర్పు 1000.

కాకినాడ స్కేప్ అండ్ కో., ముద్రాశాలలో
కె. సుబ్బారాయసోదరులచే ముద్రింపఁబడియె.

1926.


 [వెల 1-0-0.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు



| | |
|---|---|
| సూత్రధారుడు. | నరసింహం. |
| మారిషుడు. | సుదర్శనుడు. |
| సురానందుడు. | రాముడు. |
| గిరిమూర్తి. | మాధవరావు. |
| బట్లరు. | కొండప్ప. |
| గణపతిరావు. | కాంపౌండరు. |
| గురవడు. | డాక్టరు. |
| వెంకడు. | బంట్రోతు. |
| కోటప్ప. | బావాజీ. |

## స్త్రీలు.

| | |
|---|---|
| ఇందువదన. | భరతమాత. |
| జానకమ్మ. | |

ప్రకటనకర్త యనుమతినిబొంది సమర్థులగు నటకులు దీనిని ప్రదర్శింప యత్నించవచ్చును.





శ్రీరామచంద్ర

# సురానంద

నాంది.

ఉ. మందగతిం జరించెడు కు ♦ మార్గచరిత్రుల నంతరాత్మయం
దుందలపోయుచున్ గరుణ ♦ తోడుత జాలి వహించి సత్పథం
బందునఁ జేర్పఁగాఁ దగు ద ♦ యారసచిత్తులఁ బ్రోచునా సురా
నందుఁ డతిప్రమోదత న ♦ నారత మేలుత నీ సదస్యులన్. 1

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి) మారిషా ! ఒక
తూరి నిటురాఁగలవా ?

మారి—ఆర్యా—అత్యంతావసరంబుగ నన్నురావించిన గతంబేమి ?

సూత్ర—ఓయీ ! అవుసరముగాదా ? చూడుము.

గీ. ఆర్యమతసాంప్రదాయంబు ♦ లంతరించెఁ
బ్రీతిమెయి వాటిఁ బునరుద్ధ ♦ రించి దేశ
మాతగౌరవమును నిల్పి ♦ మాకుఁ దగు స
హాయ మొనరించుఁడీ యను ♦ చనవరతము
వేఁడుచున్నారు మనలను ♦ విబుధవరులు. 2

మారి—దేవా ! నాటకములన్న నతిహీనముగఁ జూచు విబుధవరు
లేమి ? మన సహాయం బపేక్షించుటేమి ?

సూత్రి—అవన్నియుఁ బూర్వాచారపరాయణుల సంగతులు. ప్రద
ర్శనాదర్శములను బాగుగా గుర్తెఱిఁగిన యీ దేశోద్ధారకులకుఁ
బ్రదర్శనములయందు హేయభావము లేదు సుమా! మారిషా—.

మ. స్థిరసంకల్పముఁ బూని పూర్వకవులీ ♦ దృశ్యప్రబంధంబులన్
వరలన్ జేసిరి దేశమెల్ల గతులన్ ♦ బాగౌచు వర్ధిల్లఁగా
నరిఁ జేయం దగు మార్గమిద్దియను వి ♦ శ్వాసంబు లేనట్టిచోఁ
బరమాశ్చర్యమి వేఁడినాదనఁగ? హా ♦ వా! యెంతయజ్ఞానివో.

మారి—సరే! అందులకు మనము చేయఁదగిన దేమి?

సూత్రి—ఏమనియా ప్రశ్నింతువు?

గీ. సంఘమందునఁ గల దురా ♦ చారముల వి
సర్జన మొనర్పఁదగిన ప్రో ♦ త్సాహ మొసఁగు
నాటక మొకండు నాఁడి యీ ♦ నాఁడు ప్రేక్ష
కులకు మనమెట్లో మోదంబుఁ ♦ గూర్పవలయు. 4

మారి—భావగారు! మన యాంధ్రభాషయం దట్టి సాంఘిక నాట
కములు చాల తక్కువ గదా?

సూత్రి—అవును. కారణమేమిటో యెఱుంగుదువా?

గీ. కవులను దరిద్రదేవత ♦ గట్టి పట్టుఁ
బట్టి తుణమేని విడియుండ ♦ నట్టికార
ణంబున రచించుటందుమా ♦ నంబుఁ బాల్పి
యున్నవారందు చేనవ్వి ♦ యున్నయయ్యె.

ఈ కారణంబుచేఁ గుటుంబ భరణార్థమై యేదో యొక గాథ
నల్లుకొని.

శా. చెప్పన్ శక్యముగాకఁ గన్పడెడు బుక్ ♦ సెల్లర్సు హాస్తంబునం
దొప్పన్ జెప్పి పదోవదేనుగొని యే ♦ దో వచ్చఁ బొమ్మంచునన్

గొప్పకావ్యమ్ము నొనరించుకొంచుఁ గవులీ ♦ స్థానంబులో నుంటచేఁ
దిప్పల్ వచ్చెను గాలమీగతిని వే ♦ ధంబంగ నయ్యోన్ జుమీ.

మారిషా—వారిని జూచినప్పుడెల్ల నా హృదయము కటకటఁ బడక పోదనుసుమా.

మ. ధనవంతుల్ గరుణార్ద్రచిత్తులయియు ♦ ద్సద్గ్రంథముల్ ప్రోచుటం
దునఁ జిత్తంబులనిల్పరేని క్షణము ♦ దున్ దేశభాషాభి వృ
ద్ధిని జేయన్ దల పూనరే కవులు ? హా ♦ దీయట్టి భాగ్యం బటం
చును నానెమ్మనమందు దుఃఖముజనిం ♦ చున్ నిత్యముల్ మారిషా!

మారి—బావగారూ ! మీరటులఁ దలపోయుదురేల ? కాలమొక్క రీతి గడవదెపుడను నార్యోక్తిని వినమా ? ఏనాటికైన నస్మహనీయులకు జాలిగలుగక పోదు. కాన శాంతమును శరణ్యముఁ జేసికొని యట్టి సత్కాలమునకై నిరీక్షించెదము. ఈశ్వరుఁడంతటి నిర్దయుఁడా ? భాషామతల్లినిఁ గాపాడఁడా ? దానికేమి గాని మనమిప్పుడే నాటకమును బ్రదర్శించి వీరల కానంద మొసంగుదము?

సూత్ర—లేదా ! "సురానంద"

మారి—సురానందయా ! దానిపేరే నే నెన్నఁడు వినియుండలేదే !

సూత్ర—వినలేదా ?

మ. తులసీదాసు గబీర్ చరిత్రముల న ♦ త్యుత్సాహతన్ వ్రాసి మె
ప్పులఁగైకొన్న యతండు, రామకథ సం ♦ పూర్ణంబుగా వ్రాసిమ
త్కులముల్ భావనఁ జేసితన్ముదముల్ ♦ గొన్నట్టి భక్తుండు వి
నులకున్ విందొనరింప వ్రాసె మనముం ♦ దున్ బెట్టెఁగా మిత్రమా !

మారి—ఆతఁడు పాదుకా పట్టాభిషేకమును గూడ వ్రాసియుండెనా?

సూత్ర—అవును. ఏతత్కవికృత నాటకములలో నిదియైదవది.

మారి—ఆర్యా! నామందమతిచే నాకవి నామము నే మఱచితినిసుమా?

సూత్రి—అది మఱచుట కాదు. నాటక ప్రారంభమునకుఁ బూర్వము గవిని స్మరింపకుండుటాచారవిరుద్ధంబని వేసినయెత్తు. ఎట్లయిన నేమి ? స్మరణకుఁ దెత్తును, చూడు!

మ. ఘనతగన్న కొండాలివంశజుఁడు, వేం ♦ కయ్యాఖ్యపుత్రుండు దా
ననుజుండై శివరామకృష్ణునకు నా ♦ హ్లాదైకపాత్రుండై
చిననాఁడే కవితంబునేర్చిన యశః ♦ శ్రీ సత్యనారాయణుం
డను నామంబున వెలుఁగొందుచుఁ గృతుం ♦ డా! జ్ఞప్తికిన్ వచ్చెనే.

మారి—బావగారూ! వారి నాటకంబులఁగూర్చి పలువురు పలుదెఱంగుల నభిప్రాయ మిచ్చుచుండిరిగదా! అట్టి స్థితిలో వీరి నాటకములఁ జూచి యాదరింతురా ?

సూత్రి—అదే వెఱ్ఱి. కవిమనోభిప్రాయముల గుర్తెఱుంగనేరని యువజ్ఞులు కొందఱట్టి యపకతపకవివపర్యనంబు లొనర్తురు. అట్టి వారి మాటల లెక్క పెట్టనేల? కవి యభిప్రాయమిది.

గీ. పండితాళికి దృశ్యప్ర ♦ బంధము లన
వసరమగు పామరుల క ♦ వశ్యమగుచు
అందుచేవారి కనువగు ♦ నట్టిరీతి
వ్రాయవలెనను దలఁపుచే వ్రాయునటులె. 9

మారి—సరే; అట్లయిన మన మింక చాలస్య మొనర్పనేల ? నాటక ప్రారంభమునకై గడంగెదమా ?

సూత్రి—అవును. మఱచితి. పాత్రల నాయత్త పఱచి నాటకమాడించుభారంబు నాయందుఁ గలదని యెఱింగియుండియుఁ గాలహరణ మొనర్చుచుంటిని. పోవుదము పద.

(నిష్క్రమింతురు.)

(ఇది ప్రస్తావన.)



సు రా న

శ్రీ

# సురానంద

ప్రథమాంకము.

(సురానందుని గృహములో సురానందుఁడు ప్రవేశము).

సురా—(స్వగతము) అమ్మయ్యో! తలపీడవదలినది.

చ. బ్రతికినవాల్గువాళ్ళు నను ♦ బట్టిపలార్చి యనేకరీతులన్
జితుకఁగఁగొట్టితిట్టి యటు ♦ చేసిన దుష్టుఁడుచచ్చె వహ్వారే!
బ్రతికితి నాకిఁకెట్టికొఁదు ♦ వల్గెలుగున్? సుఖభోగినౌచు నీ
క్షితి ఘనినంతకాల మెటు ♦ చేసిన నడ్డెడువారలుందురే?

ఈ ముసలిముండకొడుకు బ్రతికినంతవఱకు రాగిడబ్బైనను జేతికిఁ జిక్కక నేనుపడిన శ్రమ యాభగవంతునికే తెలియవలయును. ఆవిధమగు కాపీనముఁగల్గి యహర్నిశలును యినుపపెట్టెకు సేవఁజేసి సవాఁడు చివఱకుఁ జచ్చునాఁడొక్కపైసయేసి వెంటఁగొనిపోలేకపోయెనేమో? పోనీ! యేదో భగవంతుఁడిచ్చినందులకుఁ దానేనిఁ గడుపునిండఁ గూడుఁదిన్న పాపమునఁ బోయెనా?

గీ. పాతరలతోడి ధాన్యమా ♦ వరుసనుండ
ముక్కపురుగులనూకలే ♦ భుక్తికయ్యెఁ
బెట్టెలన్నింట జలతారు ♦ బట్టలుండఁ
బాతకొల్లాయియే కట్టు ♦ బట్టయయ్యె.

అబ్బా! ఎంతకాలమునకు నేను ఋణవిముక్తుఁడనయి స్వేచ్ఛ

గామెలంగు దినంబులు వచ్చినవి ? ఇఁకఁగావలసినంతస్వాతంత్ర్యము !

సీ. రిఫౌర్మ్ మెంటువా ♦ రికి నీయవలసిన
బిల్లుమొత్తముఁ జెల్లుఁ ♦ బెట్టవచ్చు
గిరిమూర్తిగాడి ద ♦ గ్గఱ వాడుకొన్నట్టి
బాకీసంతయును దీ ♦ ర్పంగవచ్చు
పేకాటలో మొన్నఁ ♦ బాకట్టుఁ బెట్టిన
గొలుసును విడిపించు ♦ కొనఁగవచ్చు
సింహాచలమువద్ద ♦ సిగరెట్లువాడిన
వెధవబాకీ పార ♦ వేయవచ్చుఁ

గీ. బాలకాలమునుండి నా ♦ స్వాంతమందు
నున్న వాయిందువదనతో ♦ నుండవచ్చు
భోగములలోడ నీఁకఁ దులఁ ♦ దూగవచ్చు
హాయిరే ! యెంతస్వాతంత్ర్య ♦ మబ్బెనాకు.

గిరి.—(ప్రవేశించి స్వ) ఏ విధమునవైన నేమి. నా ప్రభావమంతయు వినియోగపఱచి స్వాయముగ ముందుధనమును వెచ్చించి సురానందునకుఁ దాగుడు నేర్పితిని. పేకాట నలవాటుఁ జేసితిని. సిగరెట్లుగాల్చు నటుల నొనర్చితిని. వేశ్యాలిండ్లకు మార్గంబుఁ జూపితిని. చోరగ్రహణంబున నధికునిఁ జేసితిని. దెబ్బలాటల యందుఁ బ్రవీణునిఁ గావించితిని. కాని తండ్రి జీవించి యుండుటచేతఁ జేతికేమియు దొరకకుండుటచే వాని పేరు బైటకు రాలేదు. ఆకొఱఁతకూడ తీఱిపోయినది. ఇఁక వీని నాచేతిలోఁ గీలుబొమ్మఁ జేసి యాడించవచ్చును. వీని కొఱకెంతయో స్వంతద్రవ్యమును వెచ్చించితిని. ఇంతకుఁ బదింతలు లాగవచ్చును. ఎందులకో వర్తమాన మంపినాఁడు. తనకుఁ గల్గిన స్వాతంత్ర్యమునుఁ గూర్చి నాతో ముచ్చటించుటకే యైయుండవచ్చును. (ప్రకాశముగా) మిత్రమా ! ఎందులకో అత్యంతావసరముగావర్తమానమంపితివి?

సురా.—ఇదుగో వచ్చితివా ! మిత్రమా ! కూర్చుండుము.

గిరి—కూర్చుండుట కేమి కాని నీవదృష్టవంతుఁడవోయి.

సురా—నీదయవల్ల-నాతండ్రి.

గీ. రాతిరియుఁ బవలును గండ్లు ♦ జ్యోతులవలెఁ
దెఱచుకొని యిప్పపెట్టె నె ♦ వ్వరు హరింతు
రోయనుచుఁ గావలినిగాయు ♦ చుండువాఁడె ?
యింత కాపీనమేమయ్యె ♦ నంతమునకు.

గిరి—నీతండ్రి యెంత కాపీనుఁడై యున్నను నీకొఱకేగదా ? అతఁడావిధమున దాచక మనవలెనే సుందరపురుషుఁడై పూలరంగడివలెఁదిరిగిన మనకిప్పటికేనియు సుఖమేది ?

సురా—మానాయన కర్మలో నుండుటచే నిన్నుఁ జూచుటకే యవకాశము లేకపోయినది. అబ్బా ! దినమొక్క యుగముగా గడిపితినన్నమాట.

గిరి—మఱి మనకు మేజెన్నఁడు !

సురా—ఇఁక నిత్యమును మేజులేగదా. పేరయ్యశాస్త్రిగారి కీయవలసినది, నీకీయవలసినది, ఆబాకీ, యీబాకీ లన్నియు నేఁడు వదలిపోవుచున్నవిగదా ?

గిరి—నేనును నదే చెప్పఁ దలఁచుకొంటిని. వెధవబాకీ లన్నశబ్ద మింక మన చెవులఁ బడరాదురా ! కల్లీలకొట్టువాండ్లకు, సోడాషాపుల వాండ్లకు యీవఱకై కాలందఱికిఁగూడ చులకన. పెద్దపిన్నతారతమ్యముండదు. ఇదంతయు సరిగాని సురానందా !

గీ. కాలుపైఁగాలువైచి సు ♦ ఖములఁ బడయఁ
దగిన యాస్తి నొసంగె నీ ♦ తండ్రి యింక
మేము కనుపింతుమే నీకు ♦ మిత్ర ! ఐన
మఱువఁబోకుము మమ్ము నీ ♦ మానసమున.

సురా—ఎంతమాటంటివి ? అట్టి గర్వమే నాకున్న యెడల నీకొఱకు వర్తమాన మేటికిఁ బంపుదును.

గిరి—ఇప్పటి మాటగాదురా. ముందుమాట. ఈమేజాతో మనస్నేహం. మునకు దుద్దుపెట్టెదవేమో యని యంటిని.

సురా—అటులెన్నఁటికిని జరుగనేరదు.

గిరి—ఇందువదన రజస్వలయై రెండేండ్లనుండి నీకొఱకు నిరీక్షించి యున్నది. నీవేమో యుద్ధరింతువని.

సురా—అవునవును. ఆముసలిముండ నాకెప్పుడును కనఁబడుచునే యుంటుంది. కనుఁబడి నవ్వాడల్ల

గీ. ఏమొ మీచలువ యున్న నా ♦ కేమికొదువ
గలుగదంచు దైవంబును ♦ గొలుచుచుంటి
నెప్పుడో? ఎప్పుడైన న ♦ రేసుఁడీ త్వ
దీయచరణాశ్రితంబె యు ♦ ద్ధించుమందు.

అని నవ్వుచుఁ బలుకుచుఁ బోవుచుండును. ఇంతియుగాక నా యిందువదన నిజముగ నిందువదనేనోయి !

గీ. బ్రహ్మ ననుఁగూర్చి కష్టించి ♦ స్వయముగాను
బోతఁబోసిన బంగారు ♦ బొమ్మగాదె
అట్టిబొమ్మను వదలు ♦ కొన్నట్టులైన
బ్రతుక నేటికి మిత్రమా వసుధపైన.

గిరి—నీమాట సత్యము. కాని యింతవఱకు సురానందా ! వాండ్లకు సరియగుతిండిగాని సరియగు బట్టగాని లేదుగదా ! దానిపెద్ద వాడ్లందఱు నమాయకులు. పూర్వకాలపువాండ్లు. నీమీదగంపంత యాశతోనున్న వారేమి చేతువో.

సురా—దాని విషయమై నాకంతగా జెప్పనక్కఱయే లేదు. దానిఁ గూర్చి నేను వేసికొనిన ప్లానిది.

శా. మూడంతస్తుల మేడ యందున గులో ♦ బుల్ షేడ్లు షిక్స్టర్లు నూ
గాడన్ మోదముగొల్పునయ్యాలలు హో ♦ గ్యాంబైహిత శ్రీసోఫె
కౌడక్ సీ కెర్టియురూమ్సు మిత్రమ! సరే ♦ నా? పైగజల్సాలకై
కూడా శౌవలెనన్న వాటి నికక జే ♦ కూర్చుక గనక రాదొకో.

అక్కడకుం గొంచ దరిద్రమువదలును భుక్తి కందువా? నూరు యెకరములు సుక్షేత్రమైన భూమియున్నదిగదా. పదిపుట్లపంటిదానిది. ఇక సూరానందుని జేపట్టినపుడా యిందువదనకు గుడ్డలోలేముండును. నగలులోలేముండును.

గిరి—అక్కడకా గొడవ వదలినదిగదా. ఇక మనగొడవ.

సూరా—మన గొడవకేమున్నది. గడియ గడియ కొకరిని దేబిరించ నక్కఱలేదు. ఆదరిద్రము వదలిపోయినది.

గిరి—నీ వాయిందువదనను జేబట్టి యంతటిభోగంబు లనుభవించు చున్నపుడు—

సూరా—ఎందుకురా! అనవసరముగా నన్ననియెదవు? నే నంతటి దుర్మార్గుడ నగుదుననియేనా నీయభిప్రాయము.

గిరి—నీకు హామీద ప్రేమవుండవచ్చును. నిన్నాముండ వదలవలదా?

సూరా—వదలకేమిచేయును లే, దాని గుణములు చాలమంచివిరా?

గిరి—బాగోగులుమాట యిపుడుగాదు. ముందుముందు. ఇప్పటినవీనా చారము ననుసరించి మేడమీద నీపేరుతో చలువరాతి పలక వేయింతువా?

సూరా—లేకున్న దానినట్టి మంచిస్థితికిదెచ్చినట్లు మనపేరేముండును?

గిరి— మనకు శాశ్వతముటరా? ఎంతసొమ్ము బెట్టినను మన వూరు మనపేరు, మనమర్యాద వాండ్లకు లెక్కయా? తేపు రవంతడబు తక్కువకాగానే నడవవోయి యంటారు!

సూరా—ఇంతేనా! నీ తెలివి తేటలు. నీవు చెప్పినట్లుగానే నవీనాచార ములలోనే శాశ్వతకాలము నుంచుకొనుపారుపత్రములు వ్రాయిం

చుకొనుచున్నారు. మనకుఁ గావలసిన షరతులన్నిటితో లంజను బిగించననుకొంటివా ? అయినను యివి యన్నియు నెందులకు ? దానిగుణము నే నెఱుంగుదును. చదువుకొన్నది. సమస్తముఁ దెలిసినది నాతోడిదియె లోకంబను విశ్వాసముంచఁగలది. ఒక వేళ సంత దూరము వచ్చుననుకొందము. ఇంతమాత్రమునకే చెడుదుమా ? భగవంతుఁడిచ్చిన దింత గలదుగదా ! మఱేమియు భయము లేదు.

గిరి—ఎందుకో పిలిపించితివి. ఏదియో గొడవలోఁ బడితివి.

సురా—ఏదియో గొడవనకు మన నాటకమంతయు దానిపై నాధార పడియున్నది.

గిరి—ఉండవచ్చును లే. వాండ్లగొడవ లేనిదేమున వ్యవహారమువకుఁ గావలసిన తినుబండారములు మున్నగునవెవ్వరు సరఫరా చేయుదురు చూడు.

గీ. బ్రిహ్మగాళ్ళముగద మన ♦ వల్లనెట్టి
కార్యములు నెరవేఱును ♦ గాన నట్టి
పనుల గోప్యంబుగానుంచి ♦ పరువునిల్పు
నుండ వలెఁ గాదె వారల ♦యుండ మనకు.

సురా—అందులకే గాదఁటోయి య్యీయెడ్పంతయు. కాని వెంటనే మేడపని బ్రారంభించుటకు నేనొక్కందులకు యోచించుచున్నాను. తండ్రిగతించి

గీ. మాసమైనను కాలేదు ♦ మానసమున
నదురు లేకుండ వేశ్యాంగ ♦ నకయిపెద్ద
మేడగట్టించి కులుకుచు ♦ న్నాఁడు వీఁడు
తుచ్ఛుఁడని యూహ డింపరే ♦ తోడివారు.

గిరి—పోనిమ్ము కొన్నిదినములు గడచినపిమ్మటనే మాతము. అంత

వఱకుఁ జేరయ్యశాస్త్రిగారి రిఫ్రెష్మెంటురూములోనే తిప్పలు పడుదము.

సుర—ఇంతకు నిన్ను రప్పించినపని యేమనఁగా? నేటిసాయంకాలము జలసా చేసికొనుటనుగూర్చి నీతో సంప్రదించవలయునని.

గిరి—సంప్రదింపుకూడ గావలయునా దీనికి. ఆఁ, ఇఁకకంట్రీసరకుగోల కొంతవఱకాగినదన్న మాటయే ?

సురా—వెధవ కంట్రీసరకు పేరెత్తకురా! ఆబ్రాందిసంగతియే వేఱు.

ఉ. నేర్పుగఁ జేయఁగాఁబడియు ♦ నిర్మలమై దనరారు చెంతయో
యోర్పుగఁజాలకాలము మ ♦ హోదధియానముఁ జేసివచ్చియో
దార్పునఁ బ్రిజ్జిఁగాంచి భర ♦ త ప్రకరంబునఁగీర్తిఁగాంచె నీ
దర్పము గల్గునే మఱొక ♦ దానియెదుర్ బరికింపుమిత్రమా!

మఱియు.

గీ. కార్కు విప్పినఁ జెడుకంపు ♦ గలుగదందు
నీరు గలుపరు దానిలో ♦ బీరుపోదు!
గంటసేపుంచినంగాని ♦ గాటునందు!
క్షణములో లేని ఫోర్సు నె ♦ సంగు బ్రాంది.

అది గాకున్నను మనము బ్రాందిని వాడుటలో జెంటిలుమేన్ లక్షణములు గలవు.

గిరి—ఈ సంగతు లన్నియు నాకు నీవు చెప్పవలెనఁటోయి, శతమారివా సహస్రమారివా అన్నారు. ఎన్ని అయినవి.

సురా—ఏదీ! ఇప్పుడిప్పుడేగా.

గిరి—గురుదక్షిణమాట యెత్తనే యెత్తవేమిరా?

సురా—నీకు గురుదక్షిణగా నేనేమిచ్చిన సంతసింతువు?

గిరి—నాకేమి యక్కఱలేదు గాని ఒక్కటి కోరనా?

సురా—కోరుకో,

గిరి—నీవు క్రొత్తగాఁగట్టించు మేడ వ్రక్కగానున్న యింటిలో నుం డనిచ్చితివా?

సురా—ఇంతేగదా! ఇంతటి నుండి దానికీయవలసిన డబ్బే నెలకొనెల నే నిచ్చుచుందునులే.

గిరి—ఆగొలుసింకను విడిపించుకొనరాదా? నాకీయవలసిన మొత్త ముగూడ తీసిపారవేస్తే యేదోకాలము గడుపుకుంటూ వుందును,

సురా—అన్నియు వదలించుచునే యుంటినిగా. ఈమూడువందల రూపాయలు నీవు తీసికొనివెళ్ళి యెవరివి వారికి సర్దుము.

గిరి—స్నేహితుఁడనుగదా! ఆవెధవగొలుసు నీకెందులకు. క్రొత్త గొలుసొకటి చేయించుకొనరాదా? ఈమాత్రముగ నీస్నేహి తుని నీవక్క నుండనిమ్ము.

సురా—ఉంచుకోరా! నీవడుగవలయునా! మరి నీవు తొందరగా బోయి యీ జలసామాట మన పాత స్నేహితులకుఁజెప్పి నాలు గుగంటలు టంగుమని వినఁబడఁగనే రెప్రిష్మెంటు రూము కడ కు రమ్మని చెప్పుము.

గిరి—మంచిది. అట్లయిన నేను పోయివచ్చెదను. నీవుకూడ ప్రయత్న ములో నుండుము.

(నిష్క్రమింతురు.)





శ్రీ

# సురానంద.

ద్వితీయాంకము.

---

(రెఫ్రెష్ మెంటురూము)

(వి) వేశము సురానందుఁడు, గిరిమూర్తి, నరసింహము, గణపతిరావు, సుదర్శనుఁడు, బట్లరు- కుర్చీలమీద నాసీనులయి)

సురా—వెల్ బట్లర్! క్లబ్ విస్కి టూ బాటిల్సులాక్కురా.

బట్ల—సర్! ఫుల్ బాటిల్సు యివ్వరాదు. అనిమాకురూలు. అంతా పెగ్స్ లెక్క.

సురా—రూల్సు మా కెందుకు. లాక్కురావోయంటే. మఱచిపో లేదులే.

బట్ల—ఆల్ రైట్. సోడా తెమ్మన్నారా లైంజూసా?

సురా—లైంజూసే. (అనిమనుష్యులను లెక్కించుచు) వన్. టు. త్రి. ఫోర్. ఫైవ్. యస్. ఫైవ్ బాటిల్సు.

బట్ల—యస్. (అని వెళ్లును).

సుద—మేము నాన్ బ్రాహ్మిన్స్ వద్దోయి. దేవుఁడా. మాకు కాస్త.

సురా—నీయేడ్పు నే నెఱుఁగుదునులే. యు వాన్ట్ కర్రి గిర్రి.

సుద—ఆఁ. ఆఁ. అదే నీకు దెలియదూ. నాయనా యీరోజుల్లో యేమిటి బ్రాహ్మ్రగాళ్లకుఁ దెలియక పోవడమేమిటి?

సురా—మమ్మల్ని తిట్టకురా! పీకె నొక్కుతారు. ఊరుకో నమ్మ.

దిగా నెక్కటొక్కటే చెప్పవచ్చునని అనుకున్నానురే. నీకన్నా తక్కువతినే గాడిదెవరురా?

గణ—ఆఁ. గిరిమూర్తిగారి దయవల్ల నేటికి మన సురానందుని మేజా దొరికింది.

నర—ఎవరిచలవైతేనేమి. ఇప్పుడెందుకు. నీపేరునకు సరిపడ్డంతార గించు. ఎక్కడైనా డావ్ వొస్తే కొట్టుకునే ముండావాళ్లము.

సురా—ఇదంతా యెవరిచలువగాదు. వీరయ్యశాస్త్రిగారిచలువ. స్పెన్సరుకంపెనివారి చలువ. ఫ్రెంచిదొరల చలువ. ఎంత చిత్రంగా అలంకరించారోచూడరా! ఈప్లేట్లు, యీకప్పులు, యీగ్లాసెస్, అద్దాలబీరువాలు ఇది స్వర్గంకన్నా మించియుంటుందిరా!

గిరి—రుచిచూపించడము నావంతైందిగాని దీనిని మెటిపించడం నా వంతవుతుందా?

సురా—మన పెద్దలంతా యీబ్రాంది తాగడంతప్పంటారే? ప్రసవమైనప్పుడాడవాళ్లకిచ్చేదేమిటో. తెల్లదొరలంతా ప్రాణంగాజూచేదేమిటో. బ్రాందిగాదుగాఁవల్ను.

(బట్లరు తెచ్చియిచ్చును).

సురా—తీయండోయి కార్కులు. వెల్ మిస్టర్ శాస్త్రి! కేక్ యూ ప్రిపేర్ క్రిరీస్ నా.

బట్ల—మేమల్లా విగ్రహాలమేగాని అందాక మాపెద్దలు చలవకలగ లేదుసార్. మాయేసుదేవునికి మామీఁద అంతకృప రాలేదు. లేకపోతేయెక్కడనన్నా మతబోధన చేసుకుంటూవుందును.

సురా—పొలంకొన్నావుటే!

బట్ల—మీదయ. మీవంటి గొప్పలండటి కృపవుంటే నాకేమిలోటు?

సురా—నేనన్నది. కూరనార యేమైన సిద్ధపరచేగలవా అని.

బట్ల—ఇప్పుడు యగ్సు దొరకడం దుర్ఘటము. చాలా డియర్ గా వున్నాయండి,

సూరా—వెధవడబ్బును గురించి చూడను. ఎంతైనాసరే సప్లయిచ్చే యాలి ప్రెజంటు పొందాలి గాని.

బట్ల—యస్. టు రూపీస్ యివ్వండిసర్. కనుక్కుంటాను. నాకు టైం కావలెను.

సూరా—ఈలోగా మా ముగాన యిన్నిరొట్టెలో యేదో పడవేసి వెళ్ళు. నములుతూ వుంటేగాని మజాలేదు.

బట్ల—బిస్కట్లు యిస్తాను. ఫ్రూట్సు తెచ్చియిస్తాను. సిగరెట్సు యిస్తాను. ఫ్యాన్ పేవరిస్తాను. కులాసాగా వుండండి. ఎంతసేపు?

సూరా—సరే! అయితే యీ టెన్ రూపీసునోటు నీవద్దవుణ్ణీ (అనియిచ్చును) వెల్ బట్లర్! ప్రిపరేషన్సు మాత్రం చాలాజాగ్రత్తగా వుండాలిసుమా? కార్కులు తీయండరా!

బట్ల—కార్కు వోపెన్ చేసే తెచ్చానుగదా. నేనుపోదును.

(వెళ్ళును)

సూరా—కానియ్యండోయ్. నేనెప్పుడు బడితే అప్పుడే తయార్. ముందు గణపతికియ్యరా?

గిరి—ముందు తాంబూలాల తగాదా యెందుకు. గణపతీ! కానీయరా.

(వరుసగా నొక్కరొక్కరే కొంత కొంత త్రాగి సిగరెట్లు ముట్టించుచున్నారు.)

గణ—ఎన్నాళ్లకు లభించినదిరా సూరానందుని జలసా.

సూరా—ఇదంతా వొక ప్రయోజకత్వమేనా? నా బుద్ధియెప్పుడు కూడా వెంట బదిమంది మిత్రుల నుంచుకొని చక్కగా షోకుగా జలసా చేసుకుంటూ పూలరంగళ్ల లాగ తిరుగుదామనే మీదనే వుంటుంది. జన్మ యెత్తినందుల కెప్పుడును పదిమందికి పెట్టినవాడు బుద్ధిమంతుడు. లోభిగా వుండి వుండి మా నాయన చచ్చిపోయే నాడేమి కట్టుకొనిపోయాడు. సర్వకాల సర్వావస్థలయందు మన మంతా యిట్లాగే వుండాలెనని కోరిక.

సుద—బట్లరుగారు మనమాట మఱచిపోయినట్లున్నారే. బట్లరుశాస్త్రుల్లగారు. ఏవోయిప్లేట్లు ?

బట్ల—రెడీ సర్ (అని వడ్డించును)

గణ—డబ్బుగలవాళ్ళెప్పుడూ యిట్లావుండాలనని అనుకుంటారు. మాకేముంది. నీలాటివాండ్లు పదికాలాలుపాటు బాగుంటే మావంటివాళ్లకు గడుపు చల్లగావుంటుంది.

నర—మంచిమాటాడినావురా. నాఆయుర్దాయము గూడా పోసికొని బ్రతుకు.

గిరి—తెగదంచుతారు గొత్తుకొనుటకు లిచ్చేవారుండాలిగాని.

నర—నీవే పాపము. దంచలేనివాడవు. నీయమ్మకడుపు చల్లంగా బాచికపారించావు మనవాణ్ని దించి.

సురా—ఒరే. ఒకరు దించేదేమిటిరా ?

గణ—యేమిటోయ్ యేమ్పు. నాకు నిద్రవస్తూన్నట్లుంది.

నర—తేఱగా వచ్చిందని కుమ్మపట్టుపడితే నిద్రరాదురా మఱి. నీదుంపతెగ తాగడం నిద్రకోపమా? కులాసాగా కభుర్లు చెప్పుకోవాలి. కాస్త యిటూ అటూ పచార్లు చేయాలి. మనము పూళ్ళో వున్నామనిపించాలి. మగ్దూర్ మనసెట్టు బయలు దేరిందంటే. ఆడవాళ్ళు పాడలెత్తి చావాలి... కానీయండిప్లేట్లుగుద్దండి.

(అందఱు తినుచున్నారు)

గణ—సురానందులవారి మేడకు కలపాగిలపా వచ్చినట్లుందే ?

నర—రాజు తలుచుకుంటే దెబ్బలకు కొదవా ?

సురా—అవునురా! మీరంతా నావెంటవుండి కనిపెట్టుతూ వుండండి ఎన్ని మేడలు వేయిస్తానో?

నర—వేయిస్తావురా! ఆగర్భశ్రీమంతుడవు. నీకేం. దీనికేంగాని సరి. పెట్టారేం. పూజ కానీయండి.

సురా—ఊఁ (అందఱు మఱలఁ దాగుదురు)

గిరి—ఈలంజ జాతికి విశ్వాసముండదంటారు.

సురా——మంచి ప్రస్తావమెత్తినావురా, కవులు మూర్ఖులు. ఏటావల వూళ్లేలేవంటారు. అందఱి యందుఁగల దోసము నా యిందు వదనముమీఁద ఆరోపిస్తే నాకు కడుపుమంట ఆగదు. దాని కాళ్లు కడిగి నీళ్లునెత్తిని చల్లుకుంటే మనకెప్పుడేమయినా దానంతటి వాళ్లమయ్యే యోగ్యత కలుగుతుందేమో.

మద——అంతటి దానిని నీవు చేతఁబట్టిన తరువాత దాని కాలినీళ్లే మాకు గతిగాక యింకే మవుతుంది. తావలచింది రంభ తాను మునిగింది గంగ.

సురా——వెధవ. సామ్యాలు వెక్కిరింపులు కూడాను.

సర——మిత్రమా! సురానందా! ఈయేటితో చదువు కట్టిపెట్టినట్లేనా?

మద——మహారాజా, వాఁడి కింకా చదువెందుకు. వెధవ చదువు.

సురా——కాకపోతే యేమిటి నవుకరీ చేస్తేనేగాని గడవదా?

(హోటల బట్లరు ప్లేట్లు యిచ్చును తినుచుందురు)

గుణ——ఇదంతా యేమిటి? కళ్ళుతిరుగుతూవున్నాయి. నేను తిరుగుతూవున్నాను. మీరు తిరుగుతూవున్నారు. రూముతిరుగుతూవుంది.

సురా——అన్నీ తిరుగుతూవుంటే యింక తిరుగనిదేముందిరా?

మద——నాకుగూడ అట్లాగే వుందిరా?

సురా——నాన్ బ్రామిన్సు. మీరేమి యేడుస్తారు. దర్భపోటులు గొట్టినా, ప్లేట్లు యెగరవేసినా, జంధ్యాలు బొడ్లో దోపినా మేంగాని మీరా? గిరిమూర్తిగా! తియ్యరా పేక.

బట్ల——దొరలు వస్తారు సర్. యక్స్క్యూజ్ చేయాలి. పేకవీలులేదు.

సురా——పోనిలే పోతాము. బిల్లు.

బట్ల——సర్. యిస్తాను.

సుర——ఇక్కడినుండి క్యాం పెక్కడికి?

ఇక్కడే భుజించండి. అంటుంది. సరేనంటానుగా! కూరి కూరి ఉండో

కొచ్చేటంతగా పెడుతుంది. ఎట్లాగో తింటానా కాస్త ఆయాసం తీ

ర్చుకోనీయదు గదా, తియ్యా పేకంటుంది. తనువోడువచ్చిందా!

పరియాచకానికి దిగుతుంది. మన వోడు కనపడ్డదో పెట్టు డబ్బ

క్కడ పెట్టు అంటుంది. కాస్త డబ్బులేదా ఆనకయిస్తానన్నావా!

తీయ్. రిస్టువాచ్. అనేదీ లాగేదీ—

సుద—మళ్ళీయిస్తుందా!

సురా—ఛీ! ఛీ! బోగంది. చేతితో లాక్కుంది మళ్ళీతీసుకోడానికేమి గాడ్దెననుకున్నావురా?

(బట్లరు బిల్లు తెచ్చియిచ్చును.)

సురా—ఎంతఅయింది. రు 28-14-0 లా? రు 10-0-0లు పోను రు18-14-0 సరే రు20-0-0 లు యివిగో మిగతది ప్రెజంటుతీసుకో

బట్లరు—సలాం చేస్తాను. దొరగారువచ్చే వేళయింది. ఇక మీరుదయచేయు వలెను.

సురా—తొందరపడకు. వెళ్ళక కూరుచుంటామా! ఉండు. సుదర్శనం పలుకులు చిలుకపలుకులు. కంఠము కోకిలకంఠము. దానిచూపులకు మన్మధుడు హడలెత్తి పరువెత్తాడు. దీని మొగంజూచేటప్పటికి చంద్రుడి మొగం వెలవెలబోయిందిగా వాళ్ళు. వెనక్కి పోయాడు. దాని సరసత. ఆ ఆదరణ. ఎందుకురా! యజ్ఞాలు యాగాలు చేసి రంభకోసం దేవులాడే వెధవలు. తప్పు తప్పు. ఒరే. ఏమిటోగన్ మాటలు తూలుతూవున్నాయ్. పొరపాటు వచ్చినప్పుడు ఆ అని అదలించ వద్దంటరా. ఆ పడరాని పాట్లు పడే పెద్దమనుష్యాలంతా వున్నారే వాళ్ళ సౌఖ్యం నాసౌఖ్యం క్రింద మొన్నానంతు.

గిరి—ఇప్పుడు నా మాటలు మీబుర్రలో ఎక్కేటట్టుగా లేవు.

సురా—ఎక్కకేమివుండరా! ఇప్పుడెక్కినంతవటకు చాలును. కుమ్మరసారె తిరిగినట్లుగా తిరుగుతూవుంది. ఆకాశము, భూమి నవ్వు,

నేను, వాడు, నీవు, అరే! బట్లర్, టేబిల్సు, అలమార్లు సీసాలు, అన్నీ తిరుగుతూవున్నాయిరా?

గణ—మరి అలా అయితే గతేమిటి? నీకూతిరిగి వాడూతిరిగి అందరికీ తిరిగితే యిళ్ళకు జేరేసూత్రాన్తెట్లాగంటా?

సురా—ఒక టేసూత్రం. భుజాలమీద చేతులేసుకోవడం. బయల్దేరి నడవడము.

గణ—ఎవళ్ళన్నా యెదురుబడతారా?

గిరి—బడితేనేమిరా! వాళ్ళసొమ్ము పెట్టారా! మనసొమ్ము పెట్టిమనం తాగాం. తందనాలు ఆడుతాం. రోడ్లమీద దొర్లుపుచ్చకాయల్లాగ దొర్లుతాం. వాళ్ళకేమిటంట—

సురా—అంటోగింటో మీ యేమప్ప మీరేడవండి. నా దారిన నేను పోతాను.

సుద—మహారాజువి గనుక—చక్కగా మేడ గట్టించుకున్నావు గనుక బంగారపుబొమ్మను సంపాదించావు గనుక—చక్కగా, తీవిగా, షోకుగా, తాకుతీకుమంటూ పూలరంగడిలాగ ఆ వందిరిమంచపుమీద ఆ బొమ్మలుచూచుకుంటూ సరదాగా వుంటావు.

సురా—అవునురా? అంతేగాదు. ఇంకావుంది సరదా, ఆయిందువదన చేత, ఆ కుందరదనచేత, ఆమందయానచేత, ఆసుందరాంగిచేత, (తేపి), ఆ! కదలమారింది. దీని తస్సాగొయ్యా.

గణ—పొట్ట రాసుకో.

సురా—(సర్దుకొని) ఎక్కడున్నాను?

గణ—రైలుస్టేషనులో ప్లాటుఫారంమీద. ఆఁ, ఆఁ, కాదు. కాదు. రిఫ్రెష్మెంటురూములో.

సురా—అదిగాదురా! మన సంభావన ఎక్కడున్నదన్నానురా? గాడిదా! అని రాగందీయును.

గణ—సంగీతములోకి దిగి-ది.

సురా—దిగిందీ? వహ్వా! ఆనందంలో తన్మయత్వముఁ జెందినామన్న మాటే. పరమానందంలో పరిసిపోయినామన్నమాటే, బ్రహ్మానందంలో లీనమైనామన్నమాటే. ఇప్పుడు మనము భూమ్యాకాశముల మధ్య యెరోప్లేనులో బడి పోతూవున్నామన్నమాట.

గణ—కాదు. తాగుబోతులమై కళ్ళు మూసుకుపోయి గబ్బిలముల మైతిమన్నమాట.

సురా—కాదురా! తాగుబోతులేమిటి! పరబ్రహ్మ స్వరూపమును కనుక్కునే సూత్రం గట్టిగా పట్టుకున్నామన్నమాట.

గణ—వారు గంజాయి దంచుతారురా?

సురా—మనము బ్రాంది దంచుతాము. ఏదైతేనేమి తల దిమ్ముబట్టి ఆనందము కలగడానికి. నిశ్చలత్వము కుదరడానికి. మనకుమాత్రము తత్వాలురావా? భజనచేయులేమా! అనండి రమారమణ గోవిందోహరి. (అందఱు నందురు).

బట్లర్—అయ్యా! ఏమిటండి అల్లరి. పెద్దమనుష్యులనుకుంటే. చాలు. దయచేయండి.

సురా—వెళిసివావుపోవోయి టప్పాన్. కానీయండిరా! ఒక సాంతాంతరమంది. చెప్పనా! పాడుతారా!

తత్వము.

ధర్మమొక్కటే బ్రతకవలెనండి ♦ మానవులారా!

(అందఱు నందురు).

సురా-చ. నిర్మలంబగు బ్రాందియిదిగో ♦ నిశ్చలత్వముగూర్చిమిమున ధర్మయుతులుగఁజేసి నిరతము ♦ జ్ఞానకర్ములుగాగ జేయు॥

(అందఱు పల్లవిఁబాడుదురు).

సురా-చ. ధైర్యవంతులఁ జేయునుసుమండీ! దౌర్భాగ్యులారా!

ధైర్యవంతులఁజేసి తగుపో్రి ♦ త్సాహమిచ్చి యనేక సాహస
కార్యములఁజొరఁబెట్టి తానా ♦ దార్యబుద్ధినిజూపుదీసి॥మ॥

సుద—(పాటకు అడుగు వేయుచుఁదూలి టేబిలుమీఁదనున్న సీసాలం పగులఁగొట్టును.

బట్లర్—(కోపముతో సుదర్శనుని తెక్కపుచ్చుకొని యీవల కీడ్చిపాఱవేయును.

గిరి—అరే ఫూల్! మనుష్యునిపట్టుకొమని యీ త్సేదిరా! సీసాలు పోతే డబ్బుతీసుకో.

బట్లర్—మాటలు తిన్నఁగారానీయండి. డబ్బిస్తే సీసాలువస్తాయా? స్పెన్సరు వారు పంపించాలిగందా!

సురా—ఏమిటోయి వచ్చినప్పటినుంచి వెళ్లండి వెళ్లండి అంటూ యేడిపిస్తున్నావు. కావాలంటే డబ్బుతీసుకో, డామేజెస్ భరిస్తాము. మేమేమి ఫూల్సుమనుకున్నావా? తాగినవాండ్లల్లరిచేతురా! మేముకూపని చేసుకోవడంలో నే నిన్నా బాటిల్సుతీయవద్దన్నారా? కాస్తెంతవుతుందో చెప్పు. తీసుకో! దొరలల్లరిచేస్తేనోరు మూసుకుంటారా లేదా?

బట్ల—సర్, ఎందుకు మీరు వాదము వద్దు. డ్యామేజెస్ కొండి ఇరవై రూపాయిలు.

సురా—ఇంతే గందా? భాగ్యము. తీసుకో (అని యిచ్చును.)

బట్లర్—(తీసుకుని) ఇఁక దయచేయండి మాట దక్కదు.

సురా—పోక కూర్చుంటామా! మాకు పనులు లేవనుకున్నావా? రండరా్రి! ఇదంతా పెద్దగొడవగా వుంది.

గిరి—మొత్తం రు 50—0—0 ల అయిందిరా।

సురా—ఎంతో అయింది రండి. వారు. కోప్పడుతారు నాకూ నిద్ర వస్తూవున్నది.

గిరి—మీరు మత్తుమిన్ను వదిలి దయచేయడమేనా!

సురా—మూడు రోజులనుండి పెద్దగొడవగా వుందోయి. యీ జలసాల సరదాలో అక్కడా యిక్కడా తిరుగుతూ వుంటే యింటికాడ పెళ్ళాంగోల, అక్కడ ఆయుండగోల.

గిరి—అడగడం మఱచిపోను. పెళ్ళాం వూరుకుంటూ వుందిరా?

సురా—వెల్. బట్లర్. ముందు నీవీ రెండు రూపాయలు తీసికొని కాస్సేపు కూర్చో. గెట్ టు మినిట్స్ వుయివిల్ బి ఆఫ్ (అవి యిచ్చును.)

బట్లు—(పుచ్చుకొని ఊరకుండును).

సురా—ఏమిటాప్రి గిరి! నీ ప్రశ్న. పెండ్లాం వూరుకుంటావా అంటావా? చచ్చువాగమ్మవా— వెఱ్ఱిదద్దమ్మవా. పిచ్చిపుల్లాయివా! మగపురుషుఁడుగా నరమానవులలోఁబుట్టి ఆమాత్రి మూడుదానిని లొంగఁదీయలేక పోతానను కున్నావా! పెత్తనంనెత్తిని వేసికొని నీ యెడముచేయి తీయి వాపురిచేయి పెడుతానన్నట్లు వస్తారుగాని చెప్పకింద తేలువలె, మదించిన యేనుగుకు అంకుశము వలె పొడుస్తూ లోకులఁజూపించకుండా వుంచాలిగాని పెళ్ళాంమీద జాలిదలిచామా నెత్తికెక్క మొత్తరంటావా? అబ్బా? కొన్నిచోట్ల వున్నారు నాయనా! మగవాళ్లను వెధవల్ని చేసి కూర్చోపెట్టారు గందా?

గణ—మరీ యేడ్పించకోయ్.

సురా—ఛీ! ఛీ! కటికవాడి ననుకొన్నావా! నాకెసుగుమాట చెప్పదుగా. అట్లాగే వుస్నట్టయితే పక్కటెముకలు విరుగదన్న ననుకొన్నావా? నేను యింటికి వెళ్ళేటప్పటికి యెదురుగా వచ్చి డ్రెస్సంతా అందిపుచ్చుకొని వేనీళ్ళుపోడి వెండిపళ్లెంలో అన్నం గిన్నం పెట్టిరెడీగా వుంచవలసిందన్న మాటే.

గిరి—మఱి మేమంతా పోవలయునన్న మాటే!

సురా—(గిరితో రహస్యముగా) ఈ మూకను దోలిపారేసి మనం పోదాామ్. నరసింహాం! నువ్వు సుదర్శనం గణపతి ముగ్గురు నడుస్తూవుండండరా' గిరితో కబురుచెప్పి పంపిస్తాను.

(ముగ్గురు వెళ్ళుదురు).

గిరి.—పీడ వదిలిందిరా! మనము పోదామా యిక.

సురా—పోదాంగాని నేనేదో దానితోఁగూడా పడివుంటాడు. నీవు వూరికే పడివుండడం నాకు మర్యాదగావుండదయ్యో. ఏలాగురా భగవంతుఁడా! అని ఆలోచిస్తూ వున్నాను.

గిరి—నాకేంగాని మనం యింటికి పోవడ మెప్పుడు?

సురా—నేను వస్తేవస్తాను. లేకపోతే లేదు. ఒక్క పనిమాత్రం చేసిపెట్టు.

గిరి—ఏందోయ్. అది.

సురా—నేను యేదోవూరికి వెళ్లానని రేపు రాత్రిదాకా రానన్నా నని మా యింటి వద్ద చెప్పు.

గిరి—అందాకా అక్కడేనా మకాం.

సురా—అక్కడే. ఎందుకంటావా? మూడు రోజులనుండి నాగా.

గిరి—నేను కూడా అందాకా అవిక్కనున్న లేమ్‌చాప్ దాని కొంపలో పడివుంటా! సర్ది చెప్పి త్వరగా రారాదూ?

సురా—వాఁడు చూచాడంటే విరగదన్నుతాడు,

గిరి—వద్దాడుగాని నాలుగు రూపాయలు యిట్లా పారెయ్. నా యేడ్పు నే నేడుస్తాను.

సురా—సరే. యిండ. తీసుకో. గొడవ. ముందు యిక్కడ నుంచి మనము వదిత్తే బట్లరుగారి గోల వదుల్తుంది.

(నిష్క్రమింతురు.)



శ్రీ

# సురానంద.



తృతీయాంకము.

ఇందువదన గృహము.

(ప్రవేశము:- ఇందువదన

ఇం——(స్వగతము) మా అమ్మ నన్నింతవరకు నిలిపి యుంచినందు లకు నా కోరికెలు సిద్ధించినవి. పెద్దవాండ్ల మాట తీసివేయరాదు. "ఏపుట్టలో నేమిపామున్నదో అమ్మాయీ! యింటికి కలవ నడిగితివా యింతయిల్లు వేయించుకుండా మన్నది." అడిగిన వేళా విశేషమున మూడంతస్తులమేడ వడ్డది, పైగా పెద్దలు చేసి యుంచిన ఋణము వేయిరూపాయిలు తీఱిపోయింది, ఇన్ని వస్తువులు. ఇన్ని కోరికలు అమరినవి. కాని పంతులుగారు బ్రాందిసీసా లెగఱవేయుడం మొదలు పెట్టిననాటనుండి రొక్కస్థితి వదలడమే గాకుండా భూమికూడా తరిగిపోతూ వున్నది. దీనముండగానే వెదకుకొనుమని యింత భూమికూడా పంతులువారి పేరుమీద సంపాదించితినా కులస్తుల నందఱిని బలాదూరు తీయవచ్చును. ఏమేమో శ్రీరంగనీతులు చెప్పెదరుగాని మా మాయలలోబడని వారు లేరని మా పెద్దలు చెప్పే సంగతులన్నియు వాస్తవములే.

సీ॥ పురుషులమని గర్వ ◆ మున విఱ్ఱవీగెదు
వారి గర్వమడంచు ◆ వారకాంత

మడిఁగట్టినవారము లోఁ ♦ బడుదుమే మేమను
వారి లోఁగఁగదియు ♦ వారకాంత
కోటీశ్వరుల నేనిఁ ♦ బూట కూటికి లేని
వారిఁగా నొనరించు ♦ వారకాంత
లోభినేని క్షణంబు ♦ లోఁ గరగించుచు
వారి విత్తముఁ జూఱు ♦ వారకాంత

గీ. వారకాంతలఁ జూచుటే ♦ పాపమనెడు
వారి వాల్చూపునకెగట్టు ♦ వారకాంత!
అట్టి వారకాంతల మాయ ♦ లందుఁ దవిలి!
జోగులైపోని వార లె ♦ చ్చోటఁ గలరు?

మూఁడు దినంబుల నుండియుఁ బంతులుగారి వద్ద లేకుండ యున్నది, ఎచట తాండవమాడుచున్నారో? ఎవరు నాలుగుతాళ్ళు తగిలించిరో?

ఆ-వె. తాగి చక్కరాకఁ ♦ దండవా లాడుచు
వారి వీరిఁ గోడ ♦ వాదులాడి
చివరకింత శాస్తి ♦ చేయించుకొనుదాక
నింటి మొగముఁ జూడ ♦ రిట్టివారు.

నేను మాయమ్మయుఁ గూడ యిట్లా యెంతకు తేపు అయిపోతే పెట్టేవారెవరును లేరు. ఈవిధముగా తిరిగితే రాజాధిరాజులంటివాళ్లు క్షౌరమై పోయినారు. మన మెంతని యెన్ని విధాలఁ జెప్పినా ప్రయోజనము కనబడలేదు, పోనిమ్ము నాకేమి? ఏమో మంచి దారికో వుంటే నాలుగురోజులుంచు దాముని చూచితినిగాని మొగమోటము పెట్టుకొన్న ప్రయోజనములేదు. ఈయన క్షౌరమైన నాకేమి?

(తెఱలో తలుపు చప్పుడు)

వచ్చుచున్నట్టు లున్నయది, ఈనాఁడు పంతులు వారిని బుట్టలో పెట్టేపద్ధతి చూడాలి.

మరా—(ప్రవేశించి) వెలీ ఇందువదనా! ముస్తాబు బాగుగా కుదిరినది కాదేమి! ఎగాదిగా చూచుకుంటూ వున్నావు.

ఇందు—(విస్మయముతో) మాటలన్నాయెంత ? మీరెంత ? కానియ్యండి పంతులు వారికిల్లు యిప్పటికైనా కనపడ్డదే.

సురా—స్నేహితుల జలపాల్లో మునిగి తేల్తూవున్నాను. చిచ్చాల్లు పెట్టకోయ్.

ఇందు—జల్సాల హడావుడిలో స్నేహితులంతా చేరి కొత్త సాసుల తగిలించ లేదుగదా?

సురా—అబ్బే. ఒకవేళ వాళ్లుతగిలిస్తే మాత్రం నేను తెలివిమాలిన వాడినా ? నీతిజాతి లేదనుకొన్నావా ! ఏమిటి ? సరేగాని యీ వేళ నీ వేమో విపరీతముగా నున్నట్లున్నావే?

ఇందు—నేనా ! ఒకప్పుడు మీకు సరసంగా కనబడుతూ వున్నాను గనుక యిప్పుడు విపరీతమంటారా ! ఎప్పుడూ నా బ్రతుకు నవ్వులపాలుగానే వుండెను.

సురా—అదేమి? తాటిచూరుల ఇంటిని మేడగామార్చితిని. పరుపులు మంచాలు బొమ్మలు ఉయ్యాలలు అత్తరుదానులు రకరకాల కోకలు, పెట్టెనిండా నగలు యింటినిండా తినుబండారాలు లోటు మేమి లేకుండా యిన్ని అమర్చితిని గదా ! నీ బ్రతుకు నవ్వుల పాలెందుకు గావలసి వచ్చింది.

ఇందు—ఇన్ని యమర్చినను మీబుద్ధి మారనందుకు నవ్వుచున్నాను.

సురా—అదిగాదే. వద్దురా మీముండమొయ్యి అంటే వెంటపడుతారు. నేనుతాగనురా మొఱ్ఱో అంటే పడదోసి నోట్లోపోస్తారు. మీతో రానురా అంటే పట్టుకొని లాక్కుపోతారు. ఎట్లాయేడవను పిల్లకా. నేనైతే జాగ్రత్తగావుందామనే వుంది గాని బుద్ధి మధ్యమధ్య గడ్డితింటూవుంటుంది.

ఇందు—పోనీయండి. నాకేమి. మీ బంగరుకోరిన దానను గనుక చెప్పెదను. మీకొక్క మంచి సలహా చెప్పెదను చేస్తారా ?

సురా—నీవేమిచేయమంటే నేనుచేయలేదో చెప్పు. చేతిలో యీసిజరుసిగరెట్టువుందిగదా. ఈ యగ్నిహోత్రింసాక్షిగా చెప్పుచున్నాను విను. నీవు గంగలోదిగరా అను. నేను దిగకపోతే ఋూతిమీద చెప్పు.

ఇందు—మీరిట్లాగే తిరుగుతూవున్నారా? మీపాలంఅంతా క్షౌరము. తరువాత చిప్పా, కట్ట పుచ్చుకుని అమ్మాబువ్వ. అమ్మాబువ్వాఅని తిరిగేగతి పడుతుంది. అప్పుడు స్నేహితులు పెట్టరు. బంధువులు పెట్టరు. తెలిసిందా?

సురా—నీవైనా పెట్టకపోతావా?

ఇందు—తాటాకులుగాకాల్చు. మేమిల్లా పెడుతామా లెండి. శాస్త్ర విశ్వాసముండి పెట్టినా మీపేరుమీదుగాయిచ్చిన యీనాలుగూ క్షౌరమయ్యేదాకా పెడతాను. తరువాత మీవెనుక నేనుగూడా బయలుదేరవలసిందేగా? అయ్యో! యింతపొలముంది, దాని మీద యీ అయివజువస్తుంది. పెట్టుదాం అని జాలివేయుడా... కైనా పొలాలు తాకట్టుపెట్టుకోవడమేమో వదినుందిని చేర్చుకోవడమేమో తప్పతాగి తందనాలాడడమేమో? అంతేగా! సొగసు

సురా—అదిగాదు. నాకొక పద్ధతితోస్తూవున్నదే. ఇదుగో నాపొలం అంతా నీపేర వ్రాసియిస్తాను, దానిమీదవచ్చే డబ్బుతో కాలక్షేపముచేద్దాము. నీయిష్టములేనిదే కాని ఖర్చుపెట్టను. అట్లాచేస్తే నా తల్లికిమొగుడు. సరేనా!

ఇందు—మాపేర ఎందుకువ్రాస్తారు లెండి. మాది నీతిజాతిలేనికులము. విశ్వాసములేని ముండలము.

సురా—ఎవరన్నారు నిన్నంత మాట. నీబుద్ధి విచారించకుండానే నీయింట్లో కాలుపెట్టితి ననుకొన్నావా యేమి? చదువుకున్న దానవు. తెలివిగలదానవు. నీప్రాణమే నాచేతిలో పెట్టినదానవు.

నాకే లోటుపాటు లేకుండా ఆదరిస్తూ వున్నదానవు. అట్టి నీయందు నాకు నమ్మకము లేకపోతే యింకా నాకు లోకమేముంది?

ఇందు—ఎందుకు వచ్చిన కబుర్లు. ముఖప్రీతి మాటలు నాకు నచ్చవు సుమండీ.

సురా—నాపి ముఖప్రీతి మాటలా? ఇన్నాళ్ళనుంచి నాతో స్నేహము జేసి నీవు గ్రహించిన దింతవఱకున్న మాట. నీపై భ్రాంతి జెందుటచేత, నీ పొందు గోరని వాని జన్మ మెందుకని దలంచుటచేత, నీ రూపరేఖలను జూచినపుడెల్ల ప్రపంచమే మఱచి తన్మయత్వంబు జెందుచున్న వాడనగుటచేత, వేయిమంది వేయి విధాలుగా చివాట్లు పెట్టినప్పటికి వాటి నన్నిటిని ద్రోసిరాజని నీయానుగులకు మహుగులొత్తుచు నీ గీత దాటకుండా నీ వేది కోరిన నది యప్పుడని యిప్పుడని వాయిదాలు వేయకుండా తత్క్షణం చేస్తూవచ్చిన కుండానాడిని నన్ను పట్టుకుని యింతమాట అనడం న్యాయమేనా? తాగడం తాగడం అంటే దాని మజా నీకు తెలియకపోవడంచేత అట్లా అంటావు. నేను చెడిపోతానా? ఎన్ని తరాలు వాడినా తరగని ఆదా వచ్చే పొలాలు వున్నాయి గందా?

ఇందు—మీరు చెప్పినట్లుగా తాగినా తందనాలాడినా ఆ కాస్త నా పేరను వుంటే మీ సిగలో పువ్వు తీసేవారున్నారా?

సుర—నీ యాలోచనకు ముందుగానే నేసంటిసిగా? వెనుకటులాగను నా పొలం నీయిష్టప్రకారం నీపేర వ్రాయించుకో. నాకు హానం సారానికి, నీకు నీ సంసారానికి కూడా నీవే పెత్తనం చెయ్యి. నీవు పెట్టినప్పుడు తింటాను. పడుకోమంటే పడుకుంటాను.

ఇందు—అంతమాత్రం నమ్మకం నాయందుంచి వ్రాయండి. నేను మిమ్ముల నేదశలో వుంచుదునో చూచుకోండి.

సురా—మళ్ళీ నమ్మకమని అనకు. నీ పెత్తనంలో నే నున్నానంటే నాకేమి లోటురాదు. బాగుపడ్డానన్నమాటే. ఒక్క సంగతి అడుగుతా. కోపముః రాదుగదా ?

ఇందు—నాకెందుకు కోపము !

సురా—మొన్న రాత్రి యీలమూలలో నుంచిన బ్రాందిసీసా వున్నదా? మీ తమ్ముఁడు పీల్చివేశాఁడా ?

ఇందు—అదెక్కడికి పోవును ? తెమ్మనెదరా?

సురా—తెమ్మనెదరా యేమిటే పిచ్చిదానా ! రాత్రి తలదిమ్ము యిప్పటివఱకు వదలలేదు.

ఇందు—పోనీయండి పుత్రైనుపుట్టిన బుద్ధి పుల్లలతో గాని పోదు.

సురా—చివాట్లుపెట్టకోయి. ఇఁకనుంచి నీ యిష్టమువస్తే తాగినట్టు లేకపోతే లేనట్లు. ఇప్పుడైనను నీవు సంతోషముగా యిస్తే పుచ్చుకుంటాను. లేదా లేదు.

ఇందు—నాకెందుకు విచారము. మీసొమ్ము మీరు ఖర్చుపెట్టుకుంటారు. నాముల్లె యిస్తువున్నానా ?

సురా—అదే వద్దన్నది. నినా అనేమాట మానమంటే మానవు గందా ?

ఇందు—పోనీయండి అదంతా. సీసాతెచ్చియిస్తా వుండండి.

సురా—త్వరగారా పో—

ఇందు—(వెళ్ళును.)

సురా—పిచ్చిముండ కభిమానము ఎక్కువే. కాస్సే పేడిపించాలని యిట్లా చేస్తుంటుంది. ఈ వ్యవహారంలో వదిమంది వెంట వుంటా రని, యెటువంటి కార్యానికయినా చొరవ పుట్టిస్తుందని, అగ్నిహోత్రుఁడు, గంగాభవాని, మీదికి వచ్చినప్పటికి ధైర్యముగా యెదుర్కోడానికి శౌర్యం యిస్తుందని, యీ పదార్థంతో

యెంతలెంతవాళ్ళును కట్టివేయుటకు వీలుంటుందని యిందులో యింత గొడవవుందని, యెంత చెప్పినా వినను. మొత్తము మీద నన్ను బాగుచేయాలనే వుద్దేశము. ఉన్న భూమి కాస్త దీసిపేరువాడ వుంచానా అప్పులాళ్ళ సంగతి గోవిందా. వాళ్ళకోట్లో మన్నే. వెధవల సప్పుగూడా అడగాలి. తిండికి పదిపుట్ల గింజ లుంచుకుని నాలుగై పుట్లు. శుభ్రముగా రోజూ జలసాలు చేసుకున్నా యిబ్బంది వుండదు. (అటు నిటుఁజూచి) వస్తూవున్నది. ముందను దీనినిగూడా ముంచాలి. అప్పుడుగాని దీని మజా తెలియదు.

ఇందు—(ప్రవేశించి) ఇదండి పంతులుగారు. గ్లాసులో పోయనా ?

సురా.—ఊఁ.

ఇందు—(పోసి యివ్వఁగా)

సురా—ఇవ్వాళయినా నాముచ్చట తీర్పుదూ !

ఇందు—మీ కేమండి మహారాజులు. ఈనాడిస్తారు రేపిస్తారు తరువాత యిచ్చేవా రెవరు ?

సురా—ఇస్. అబ్బా ! తలనొప్పి మాటలు. నామాటవినక పోతివా నామీదవొట్టు.

ఇందు—(తనలో) ఇప్పుడీతని మాటవినక పోతివా మన వ్యవహారము నెరవేరునట్లు లేదు. కనుక వినుటయే యుక్తముగఁ దోచుచున్నది. నేనును పుచ్చుకుంటాను.

సురా—వట్టిమాటలు, నామీదవొట్టేనా?

ఇందు—వొట్టే.

సురా—చేతిలో చేయి వేయి.

ఇందు—(అట్లొనర్చును)

సురా—(గ్లాసులోనిది పుచ్చుకొని మరియొక గ్లాసులో బ్రాంది పోసి యిచ్చును.)

ఇందు—(పుచ్చుకొనును)

సురా—ఇప్పుడు నాజన్మ ధన్యమైనది. నా కులం పావనమైంది, తల దిమ్ము దానంతటదే వదిలి పోయినట్లున్నది. కామినులు కానే మొదిరిస్తా ననుకున్నానుగాని నన్ను సిపాహీఖాన్ అనిపించావు. ఏదీ! ఒకముద్దు పెట్టు.

ఇందు—ఎప్పుడూ అదేపనిమీదను, ముద్దులకేమిగాని ఫలాహారమేమైనా తేవద్దూ

సురా—లాక్కురా మరి.

ఇందు—(వెళ్లును) మీరీకుర్చీమీదనే పరుండండి. తొందరలో వత్తును.

సురా—అమాండా కొడుకును గూడ తీసుకురా. ఎక్కడున్నాడో చూచి.

ఇందు—ఆలాగే (వెళ్లును)

సురా—దీనిని తెలియని మూర్ఖులంతా దోషమంటారు?

శ్లో॥ పీత్వాపీత్వా పునఃపీత్వా యావత్పతతి భూతలే।
పునరుద్ధాయ వైపీత్వా పునర్జన్మ న విద్యతే॥

చదువుకొన్న మూండావాడిని. ఇంత సూత్రం తెలుసుకోకుండానే యిందులో దిగానను కున్నారు కాబోలు. బాగాకడుపునిండా స్పృహతప్పకుండా పడిపోయేటట్టుగా తాగమన్నారు. తెలివి గలిగిన తరువాత మళ్లీ తాగమన్నారు. అట్టివాడికి పునర్జన్మ లేదన్నారు.

మద్యం మాంసంచ మీనంచ ముద్రామైథునమేవచ
ఏతేపంచమకారాఃస్యుర్మోక్షదాహియుగే యుగే.

మద్యము, మాంసము, మత్స్యములు, ముద్ర, మైథునము యీ పంచమకారములను ధరించువారికి తప్పక మోక్షం వస్తుందన్నారు. ఇవి పూర్వులు చెప్పినవి కావా? శ్లోకములు గావా? అర్థము కావడం లేదా? మనస్సునకేది సంతోషమిస్తుందో దానిని ఆచరించడానికి వీళ్ల అభ్యంతరమా? వీళ్ల తాతలడ్డవస్తారా! ఇట్లాగే రోడ్డు

మీద నడుస్తాను. హడలెత్తి పారిపోవాలి. మా స్టుకనబడ్డదాలంటే. భగవంతుణ్ణి తలవడానికి దీనిలో మార్గం లేదా! (కండ్లు మూసికొని) రాముండు అదుగో! నీలమేఘశ్యాముండు. భద్రాద్రిరాముండు. కోదండరాముండు. తాగినవాండ్లకు దేవుండిట్లే కనబడ్తాడు. (తేరిపి) ఆం. ఛర్యాలేదు. ఆనందం. పరమానందం. బ్రహ్మానందం. (కుర్చీమీదనుంచి లేచి అటునిటుం దిరుగుచు) దీనికిం దోడుగా కైమా, పొరటు, చీకులు, తోగిలిస్తేవుండే మజా స్వర్గానికి బెత్తెడెడంగా వుంటుంది. అద్దంలో నా మొగమెట్లావుందో (అని ప్రక్కనున్న అద్దమును చూచుకొనంబోయి తూలిపడిలేచి మఱలం జూచుకొనుచుండంగా)

రాము—(ప్రవేశించి) ఏముందోయి బావగారు! తందనాలాడ్తున్నారు. రంగండు జోరుచేస్తూవున్నాండా? ఎందుకు అర్జెంటుగా రమ్మన్నారంట?

సురా—ఏమి లేదురా. కాస్త పీత్వాచేస్తావని.

రాము—మీకే చాలదు. నాదాకా రానిస్తారా?

సురా—ఏడ్చావులే. దా. కూర్చో. (రాముని ముక్కుదగ్గర వూది) వాసన జోరుగా దంచుతోందా యేం?

రాము—లెక్కలేకుండా?

సురా—ఓరినీముండామొయ్యా. ఎంత తొందరలోం బసికట్టుతావురా? పుచ్చుకో. అదిగో. గ్లాసు. సీసా.

రాము—(కావలసినంత వేసికొని త్రాగును) బావగారూ! బ్యామ్మర్లు తాగుతారుగండా తప్పుగాదండీ?

సురా—తప్పేమిటి. బాలింతరాళ్ళకు పనికొచ్చి, ఆసుపత్రిలలో మందులలో కలవడానికి పనికొచ్చి మనకు పనికిరాదూ? సరిగాని అదేదిరా.

రాము—అదే సరు.

రాము—ఇంతేగందా! దురుసు రావడం లేదుగదా! బా
చప్పనెక్కుతుందండి?

సురా—నాకంత దురుసు లేదురా?

రాము—ఎంత—తాగవారని? పట్టుమని అరబుడ్డి లేదరె
పేకదమ్మున పోశ్చేస్తిని;

సురా—ఏదీ సీసా యెత్తు చూదాం. (రాముఁడెత్తగా బూ
తేనా, పొయ్యి గ్లాసులో, (పోయుఁగాఁ దాగి) మి
కాదయచేయ లేదేమోయి!

రాము—వస్తోందండి. అక్కా! రావేమే!

ఇందు—(పరివేశము పెద్ద పళ్లెములో) పంతులుగారు!

సురా—(తినడం మొదలు పెట్టుచు) ఓ! దానికేం. ముప
తుఁడనై నీ బుగ్గలవంక, నీమూతివంక, నీముక్కువంక,
నీపాదాలవంక, రాముఁడువంక, నీవంక, నావంక,సీసా
టితో చూస్తూ, చంక లెగఆవేసుకుంటూ,లొట్టలేసు క
కమ్మగా, పుల్ల పుల్లగా, మళ్లీ యీా పళ్లెం మీా
నిస్తానా ?

రాము—బావగారూ! ఆపని మాత్రం చేయకండి. ప
తినేస్తే కరువుకాలంలో కానుక్కోలేము.

సురా—మనోహారీ! నీవు నా ప్రక్క లేనిదే అదియెంత
ప్పటికి నాకు చప్పఁగానే వుంటుంది నీవుకూడా, నా

ఇందు—వీటికేమి లెండి.

సురా—అంటే?

ఇందు—అంటే మరేమీా లేదు. బాగిందినీళ్ళు ముడుసువ
మహారాజు నడిగినా యిస్తారు గందా. దీనికేమిగా
కున్న వ్యవహారం-

సు రా—ఏ వ్యవహారము?

ఇందు—మఱచిపోయారు. ఇదిగో యిదే యిందులోని మహత్తు. నా నావరి సంగములలోనికి దింపి అసలు వ్యసనాసారమును పాడుచేస్తుంది భూమి నాపేర.

సురా—ఓ! యిదా. అన్నమాటకు వెనక్కు తీస్తాననుకున్నావా? నీవు గీసినగీత దాటితే నీమెడమ కాలిచెప్పు నామెడలోకట్టు. సరేనా?

ఇందు—ఈలాంటి మాటలు సాధారణముగా మనలాంటివాళ్లే మీలాంటి సమయాల్లో అంటూవుండేవే లెండి. కొత్తవిగావు.

సురా—ఇప్పుడు నేను తాగి మాట్లాడుచున్నాననేవా! నావి తాగుమోతుమాటలు చేశావుగా! చెప్పు చెప్పు. ఇదుగో; ఈసురానందుఁడు, ఈ నీప్రియుఁడు, ఈ నీ మోహనాకారుఁడు. ఈ నీమనోహరుఁడు, యింకా చెప్పనా? సుందరీ! తూలుగా మాట్లాడుతూవున్నావా? చూచుకో. ఈనీ సేవకుఁడు నీయాజ్ఞలను, నీ మనవులను నీవిన్నపములను, నీ మాటలను, నీ యాటలను, నీపాటలను, యీ బొమ్మలు, మంచాలు, పరుపులు, కిటికీలు, యీ గోడలు, బావరాముఁడు యిదంతా యెందుకు? యీ సీసా సాక్షిగా, యీ కూరపళ్ళెంసాక్షిగా, నాగాయత్రితోడుగా, మీ యమ్మతోడుగా, శిరసావహించి ఆనందపూర్వకముగా, ఆహ్లాదపూర్వకముగా, మనస్ఫూర్తిగా. నీపాదాలసాక్షిగా (అని పాదములు పట్టుకొనఁబోయి క్రిందపడి లేచి) ఊ! కాస్త పట్టుకుంది.

గాము—(నవ్వుచుఁ జప్పట్లుకొట్టి) బావగారు పరమానందభరితులై శివాలాడుచు నాడవాళ్ల కాళ్ళమీదఁ బడుచున్నారు. వరేవా! మీరేమి మగవాళ్ళండీ?

సురా—నేనురా వెధవా! ఆడస్త్రీల కాళ్ళుపట్టుకునే వాణ్నిగాను. నా ప్రేమంపురాసి యని- నాసుగుణాలవాల యని- నావరహాల

ఇందు—మఱచిపోయారు. ఇదిగో యిదే యిందులోని మహత్తు. నా నాప్రసంగములలోనికి దింపి అసలు వ్యవహారమును పాడుచేస్తుంది భూమి నాపేర.

సురా—ఓ! యిదా. అన్నమాటకు వెనక్కుతీస్తాననుకున్నావా? నీవు గీసినగీత దాటితే నీయెడమ కాలిచెప్పు నామెడలో కట్టు. సరేనా?

ఇందు—ఈలాంటి మాటలు సాధారణముగా మనలాంటివాళ్లే మీ లాంటి సమయాల్లో అంటూవుండేవే లెండి. క్రొత్తవిగావు.

సురా—ఇప్పుడు నేను తాగి మాట్లాడుచున్నాననేనా! నావి తాగుబోతుమాటలు చేశావుగా! చెప్పు చెప్పు. ఇదుగో; ఈసురానందుఁడు, ఈ నీప్రియుఁడు, ఈ నీ మోహానాకారుఁడు. ఈ నీమనోహరుఁడు, యింకా చెప్పవా? సుందరీ! తూలుగా మాట్లాడుతూ వున్నానా? చూచుకో. ఈనీ సేవకుఁడు నీయాజ్ఞలను, నీ మనవులను నీవిన్నపములను, నీ మాటలను, నీ యాటలను, నీపాటలను, యీ బొమ్మలు, మంచాలు, పరుపులు, కిటికీలు, యీ గోడలు, బావరాముఁడు యిదంతా యెందుకు? యీ సీసా సాక్షిగా, యీ కూరపళ్ళెంసాక్షిగా, నాగాయత్రితోడుగా, మీ యమ్మతోడుగా, శిరసావహించి ఆనందపూర్వకముగా, ఆహ్లాదపూర్వకముగా, మనస్ఫూర్తిగా. నీపాదాలసాక్షిగా (అని పాదములు పట్టుకొనఁబోయి క్రిందపడి లేచి) ఊ! కాస్త పట్టుకుంది.

గాము—(నవ్వుచుఁ జప్పట్లుకొట్టి) బావగారు పరమానందభరితులై శివాలాడుచు నాడవాళ్ల కాళ్ళమీదఁ బడుచున్నారు. వరేవా! మీరేమి మగవాళ్ళండీ?

సురా—నేనురా వెధవా! ఆడస్త్రీల కాళ్ళుపట్టుకునే వాణ్నిగాను. నా ప్రేమంపురాసి యని నాసుగుణాలవాల యని నావరహాల

కుప్పని- నాకనకంపు విగ్రహంబని- వామనోహారిణి యని-నా బహిఃప్రాణమని అనుకొని అట్లాచేశాఁగాని నరమానవజన్మం బడసి మగపురుష వీరపరాక్రమ సాహసధైర్య స్థైర్యశౌర్యములుగల కేసరి సింహమునని పేరు పొందిన నేనేమిటి! అంత అప్రిచ్ఛపు పనిచేయడమేమిటి. సుందరీ! తరువాత? ఆఁ జ్ఞప్తివచ్చింది. పొలం నీపేరవుంచితే బాగావుంటుందన్నావు. ఓస్. యింతేగదా ? నీవే నేను! నేనే నీవు. నాయిల్లు నీది, పొలం నీది, నాభార్యనీదా యింకా యింకా అంతా నీవూ నేను.

ఇందు—పంతులు గారి ధోరణి బహుగక్తిలోనికి దిగుతూవుంది.

సురా—నిజమేనా?

రాము—మొత్తం మీద బావగారికి రెండు డ్రాంలు యెక్కువే అయినట్లుగా వుంది.

సురా—నిజమేరా! వాసన బాగా దంచుతోందంటావా యేమిటి?

రాము—కభుర్ల సందడిని కూరంతా వుఫ్ అని వూదేశారే?

సురా—పోరా! నీతో నాకేమిటి. సుందరీ! మంచి తాంబూలం పట్టుకురా? కాస్త స్పీడ్ తగ్గిద్దాం.

ఇందు—తాంబూలం తయారుచేసి యెంత సేపయింది (అని యిచ్చి) ఎప్పుడూ మీ యానందం, మీ షోకు, మీ స్నేహితులు, మీ భాగవతాలు యింతేనా?

సురా—ఉండు. రాముడూ! సిల్కు కండువా, కోటు, గడియారం అన్నీ నీవే లాక్కుంటే యిప్పుడు యింటికి వెళ్ళాలంటే.

ఇందు—అదే నేను చెప్పవచ్చేది కూడాను. ఎప్పుడూ యింటికి వెళ్లవలెననే చూపా? ఇక్కడుండామని లేదా? నా అందచందములు మీకళ్లకు నచ్చలేదా? నాసరసములు మీకు రుచించలేదా? నా వాక్యములు మీచెవులకు కఠోరములుగా వున్నవా?

సురా—నీతోడు. నీనోటివెంట నీవటు లనఁగూడదు. నేవినఁగూడదు. నామీాదవొట్టు. సుందరీ ! నీవెట్లావున్నా సరే. ఈసింగారములన్ని తీసివేస్తే మాత్రిం నీ యందానికి లోటువస్తుందా ? నీవు మూతి ముడుచుకొని కూర్చుంటేమాత్రిం సరసానికి లోపమువస్తుందా ? నీవు బూతులు తిట్టితేమాత్రిం నాచెవులకు విపరీతంగా వినఁబడు తవా ? ఎందు కిదంతయూను ఆగు ఆగు,

ఇందు—ఇంత వాసనతో—ఈ వేషముతో—ఈ నాగ్గోరణితో—ఈఉయ్యాలవడకలతో... యీావింత చూపులతో...ఈవికసితచర్య లతో—యింటికి వెళ్లుదమనే మీాయభిప్రాయమా ?

సురా—ఆఁ. అంతేనా ! పందెం వేస్తారా ? ఒక్కడనే పోనా (అని లేచి తూలి క్రిందఁబడి మరల లేచి) బావా ! రామన్న ! నవ్వాను రా ? కాలుతూలింది. కాదు. జారింది.

రాము—నవ్వను లెండి. మీారు పడడం నేను నవ్వడమునా? మనతో మనమే నవ్వుకుంటే యెట్లా ! అదంతా అట్లా పెట్టండి. మీాకన్న తక్కువ తాగిన లంజాకొడు కెవఁడు చెప్పండి.

సురా—సుందరీ ! వీడితో నేమిగాని యేదీ వొక ముద్దు పెట్టా మజాగాను.

ఇందు—ఒకటిగాదు నూరుపెట్టెదను.ముందు మనకని గానీయుండి. ఆల స్యం అమృతం విషమన్నారు.

సురా—ఓ ! లెక్కలేకుండా ! తెప్పించు బ్రాంపు. నాకేమి సంశయ మనుకున్నావా ? నన్నుఁగాక నీవు తింటావా ?

ఇందు—మాజాతినిబట్టి లోకమంతా విపరీతముగా మాట్లాడుతారు. గానీయండి. నాసంగతి మీారు యిన్నాళ్ళనుంచి చూస్తువున్నారు. గందా ! ఎప్పుడైన్నా ! వివస్తువు చేసుకున్నా ! విచిత్రించేసినా ? మీారు లేనిదే మీారు రానిదే నేనొక్కదాన ననుభవించావా ?

మీబాగుకోసం చెప్పితినిగాని వావాళ్లో యేమీ వడ నుసుసుండి? మీయిష్టం.

సురా—అబ్బా! అదంతా ఎందుకు! కాగితం తెప్పించమంటినిగా?

ఇందు—తెప్పించితిని. వ్రాయించి యుంచితిని. మీదస్కతు మాత్రం కావలసియున్నది. ఇక్కడనేయున్నది గూడాను. పట్టుకొని వస్తాను.

సురా—పట్టుకురా! పెట్టుతాను.

(ఇందువదన వెళ్ళును)

రాము—బావగారూ! అనుగూబోడుగూ యేమైనావుందేమో వెత్తుక్కురానా?

సురా—ఊ! పో.

రాము—(వెళ్లును)

సురా—ఇది యానందమే. స్వర్గలోకసౌఖ్యానందము. దీనిని మించిన యానందము లేదు. నేనెక్కడున్నానిప్పుడు. ఎక్కడున్నానో! నా మేడలో-దీనిని నిషేధించామన్నారు. వీరు మాకేమి దొరలా! లార్డా! గవర్నమెంటా? అందతికిసర్వ యిష్టఅవుతుందో కాదో అని నిషేధించారు. అర్భకులు వాసనపట్టలేక నిషేధించారు. దీనిపేర ఆస్తివుంచితే నాకు చిప్పాకట్టా యిస్తుందంట. వీధలోకి యీడు స్తుందంట. ఈడ్చేదయితే యీపాటికేయీడ్చును. వీడి తాతముల్లె అంతా పోయినట్లుగా తాగబోకు గుండెలుమాడుతాయి అంటాడు. (కృష్ణునిపటము దీసి) ఓహో! ఏమివిగ్రహమండి! బాలగోపాలకృష్ణుడు. నవనీతచోరుడు. గోపికావస్త్రాపహారి— కోకలన్నీ యెత్తుకపోయి చెట్టుమీద కూర్చుంటే ఎట్లావున్నాడో నేనుగూడా అట్లాచేస్తే ఆడవాళ్లంతా యేమంటారో? కృష్ణుడంటారా! దేవుడంటారా! అనరు. దొంగదొంగ అని వీపు వగిలే వఱకు దంచుతారు. తాగిననీళ్లు కక్కేదాకా తంతారు. ఎముకలు

వేరుతారు. చూర్ణంచేస్తారు. కృష్ణా ! నీవున్యాయమేమిగా! నీవంటివా
ణ్నిగాదూ ? నేను మగవాణ్ణిగాదూ ? నీకు పదహారువేల నూటు
యెనిమిదిమంది భార్యలేమి ? నేను యిద్దరిని వుంచుకొంటేనే యీజనం
అంతా కళ్ళల్లో నిప్పులుగొట్టుకోవడమేమి ? నీవుదేవుడవా ? నేను
దయ్యాన్నా ! నిన్నుగన్నట్లు నన్నుయమ్మన్నుకనలేదూ? నీవు దేవుం
డవేగాని ద్రొంగలంజకొడుకవు. నీగుణాలన్ని మంచివేకాని ఆరెండు
చెడిపోయినాయి. (క్రిందబడవేయంగా పటము బద్దలగును)
పగిలిందీ ? వెధవపటము. ఇటువంటివనేకవందలొస్తాయి. డబ్బును
మనముసంపాదించామూ మన్నిడబ్బుసంపాదించిందా ? వెధవడబ్బు
తాగాను.నాసొమ్ము నేనుతాగుతాను. నాతండ్రియిచ్చాడు. చచ్చా
డు. మా అమ్మకు నామీదకోపము. దాని అండజూచుకొని నా
పెళ్ళాంకూడా నన్నేమో అనాలని మిరిమిరి చూస్తుంది. అనడ
మేనా ? నోరుతెరిస్తే పక్కయెముకలు విరగవూ ? నుంచోఅంటే
నుంచోవాలి. కూర్చోఅంటే కూర్చోవాలి. అంతే మన సంగతి.
వ్యవహారాలెట్లావున్నా అనుకొన్నట్లుగా జరిగితీరవలసిందే గాని
యెదురుపచ్చిందేంపంతులు లేడాఖా. ఊం. నాసంగతెలియంగనివారె
వ్వరు.? (సీసాచేతబుచ్చుకొని) బ్రాంది. చక్కని బ్రాంది. నిర్మల
మైన బ్రాంది. నాప్రాణతుల్యమైన బ్రాందీ. అమ్మా ! నాజన్మలో
నేను బ్రతికి వుండంగా విడవడమేనా ? హుం. చస్తే. ఓ ప్రియ
మైన బ్రాందీసీసాగారూ ! సలాం. నీవిభుత్వమాచంద్రార్క
ముగా నిలుచుంగాక. అందాకనాసేవ నీకు లభించుం గాక పెద్ద
ఆచారంపెట్టుకొని బైటున్నదని లక్ష్మీదేవిని అవతలికి గొట్టితే
యెంత దశపట్టిందో నిన్ను నిషేధించామనేవారికందరికీ అంత
దశపట్టుం గాక. సురానందులవారి శాపము వేదములోనిముక్క.
మాదేశంలో వున్నసముద్రాలు, ఏర్లు, చెర్వులు, కాలువలన్నీ
కూడా బ్రాందిమయం చేయాలని వుంది. తలుచుకుంటే యెంత

బొమ్మయేనా? నాచిలుకల కొలికియేనా? దొంగముండా! చెల్లిం
చుకో నీముద్దు! చెల్లించు నాముద్దు.

ఇందు—ముద్దెంత సేపులెండి! కాగితము తెచ్చి యుంచితిని.

సురా—తే!

ఇందు—(ఇచ్చును)

సురా—(సంతకంపెట్టును) తీసుకో. విధపడి యింతమాత్రం దానికి పెద్ద బ్రహ్మాండమా? నాలుకొకటే సుమా! పుట్టిందెక్కడనో తెలుసునా?

ఇందు—మీకు నిద్ర వచ్చుచున్నట్లున్నదే.

సురా—అవును వక్కడి.

ఇందు—పక్కలు తక్కువగునా! మెల్లగా గదిలోనికి వెళ్ళి పరుండండి. నేనూ యిప్పుడే వత్తును.

సురా—తొందరగా రా! పందిరి పంచముమీద పరుండెదను. నీవు వచ్చువఱకు నిద్రపోను. (అని నెమ్మదిగా వెళ్ళును)

ఇందు—అమ్మయ్య! కావలసిన పని పూర్తి అయినది. ఇంక నీశనైశ్చరుఁడెట్లు పోయిన నాకేమి? ఈగొఁడెంత? ఎన్నవవాఁడు.?

సీ. పిసినిగొట్టయిన యా ♦ వీరయ్యశెట్టి యా
స్తినిగుంజి జోలెవం ♦ దించినాను
డాబులూరక పంగి ♦ డబ్బియు నేప్పు! నా
గురునాథుఁ జప్పగా ♦ గొరిగినాను!
భోగంబులాలికించి ♦ జోగినిగాఁ జేసి!
పార్థసారథినిట్టె ♦ పంపినాను,
వాల్బాపులోని లో ♦ భత్వంబుమటిపించి
శేషయ్యనుఁ భిక్షుఁ ♦ జేసినాను
గీ. వాగుపిరసనేలనె ♦ వ్వారు పాదు
చేతిలోఁ దాటిపోయిరి ♦ నాతిరంబు

గానిదొకటున్నదే యందుఁ ♦ గాదె చూడు
వర్ణమంతయు ననుగౌర ♦ వముగఁజూచు.

వెలయాలి తెలివి తేటలలోని ముఖ్యములగు ఘట్టములందుఁ.- జక్కఁగా దరిబీసుతైన నేనీమాత్రపు స్వల్పపుపనికి జంకుదునా? త్రి తరంబులదాక సుఖముగాఁ గాలిపైఁ గాలువేసికొని యనుభవించఁదగిన యాస్తిని సంపాదించితిఁగదా? కాని తమ్ముఁడు త్రాగుఁబోతు. తల్లి నల్లమందుది. ఇదిగాక నన్నుఁగూడ నీముండాకొడుకు మూతిముంచినాఁడు సంపాదించుటకేమి. వేలు, లక్షలు, కోట్లు, గడించుటలో మావాండ్లు ప్రజ్ఞావంతులే. కాని యేమి ప్రయోజనము మాముండలు !

గీ. చల్లఁగా నెవరికేని నా ♦ షక్కుపడి ధ
నంబు సర్వంబు వాడి మొ ♦ గంబునందుఁ
బెట్టియవ్వాల జోలెతో ♦ బిచ్చమునకు
వెడుకుదురు సిగ్గుబిడియముల్ ♦ విడిచిపెట్టి,

ఇఁక ముసలిముండలసంగతిఁ జూతమా !

గీ. కల్లుత్రాగుటకసికొంత ♦ నల్లమందు
కనుచుఁగొంతఁ బుగాకున ♦ కనుచుఁగొంత
ననుదినంబును వ్యయముఁ జే ♦ యంగ మొదలు
పెట్టి సర్వంబునకుఁ జేటుఁ ♦ గొట్టుచుంద్రు

ఒకవేళ వీరులోభులై కొద్దియో గొప్పయో దాచుకొన్నను మగముండాకొడుకు లూరకుందురా?

గీ. త్రాగుబోతులరై సమ ♦ స్తమును గొల్లఁ
గొట్టి కర్రలఁజేఁగొని ♦ కొట్టితిట్టి
బయట రౌడీలతోఁ జేరి ♦ వాదులాడి
చేరుచుందురు రచ్చల ♦ సిగ్గువిడిచి.

గీ. జూదములనాడి మితిలేని ♦ పోరులందు
బుద్ధిఁ జొరనిచ్చి రోడ్లపైఁ ♦ బొరలి పొరలి

పౌరుషజ్ఞాన కీర్తుల ♦ వదలిపెట్టి
తిరుగుచుందురు దేశ ది ♦ మ్మరుల రీతి.

రాము—(ప్రవేశించి) అక్కా! బావగారు పక్కనిండా కక్కారే!

ఇందు—వాడి ముంపతెగ. అనుకొన్నంతా చేశాడు. రాముడూ! ఆవరుపు కింద పడేసి కాస్త మన్ను పోయలేకపోయావా?

రాము—నీతో చెబుదామనివచ్చా! వెళ్ళుచున్నానులే. నీవుకూడా రా?

ఇందు—వస్తూవున్నా పద.

రాము—ఓరిబ్రహ్మదేవుడా! మాగతియింతేనా?

సీ. మూటలు మోయింప ♦ చీటుల సందింప
వృత్తి మాకంచుఁగ ♦ ల్పించినావు
సీసలం జేర్చి యీ ♦ చెనటులం ద్రుప్తిం జెం
దించుటే గతిగఁ జే ♦ యించినావు
నీచంబయిన యట్టి ♦ యాచనా వృత్తియే
దిక్కు మాకంచు వి ♦ ధించినావు
పగలు రేలును యిట్టి ♦ భ్రష్టులఁ బిలుచుటే
మావిధియంచు ని ♦ ర్మించినావు.

గీ. తొల్లి కక్కినవారల ♦ దండ మొఱఁగి
సేవఁజేయుటయే గతిఁ ♦ జేసినావు
చదువు సంధ్యల బుగ్గిపా ♦ ల్గలిపినావు
పాడయే నీకు యీబుద్ధి ♦ బ్రహ్మదేవ.

(అని నిష్క్రమించును.)





శ్రీ

# సురానంద



## చతుర్థాంకము.



మాధ — (ప్రవేశించి స్వగతము) కట్టా! ఎట్టిదేశమున కెట్టిగతి పట్టినది?

శా. కర్మక్షేత్రము భారతోర్వి యని బ్ర ♦ ఖ్యాతిన్ గనన్ జాలి స
ద్ధర్మంబుల్ మితిమీరి సంపదల వే ♦ ద ప్రాభవం బందఁగా
మ[illegible] జేరికొందఱు సదా ♦ మద్యంబునన్ దావి దు
ష్కర్మ[illegible]ంబుల నాటఁ బాపుగలిగెం ♦ గా నీకు దారిద్ర్యమా!

ఔరా! ఈపాట్లు భరతఖండమునకు రాఁదగినవేనా?

సీ. సకలవేద పురాణ ♦ శాస్త్రంబులుద్భవిం
చిన భూమి కా యిట్టి ♦ చెట్ట బుట్టె
సిరిసంపదల విల ♦ సిల్లుచు ప్రమఁ జెందు
భరతోర్వికా! యీ వి ♦ పత్తుకలిగె
వీరకర్మప్రవృత్తి ♦ ర్వీరఁ బరగిన
రణభూమి కేన? మా ♦ రకము బుట్టె
ధర్మంబు నాల్గు పా ♦ దములపై నడచెడు!
కర్మభూమి కె? యిట్టి ♦ కర్మమొ[illegible]వె?
కారణము దేలకో యిట్టి ♦ కష్ట దశకుఁ
జిక్కి భారతజనయిత్రి ♦ సొక్కియుంట
కక్కటా! మద్యపాన దు ♦ ర్వ్యసనమందు
సుతులు మ్రగ్గుట కాంచోలు ♦ చూడఁగతము,

సురాపానంబు సప్తవ్యసనంబులలో నొక్కటి యనియు, హైందవమతాచార విరుద్ధంబనియు, శ్రుతిస్మృతులును, బురాణేతిహాసంబులు ఘోషించుచున్నవే? ఇట్టిదురాచారంబుల విసర్జించి స్వధర్మానుష్ఠానపరులయి దేశాభ్యుదయమునకుఁ బాటుపడుఁడని దేశబాంధవు లుద్ఘోషించుచున్నారే? ఒక్కరును వారి సూచనలను, వారి విజ్ఞాపనలను చెవులఁ జేర్చువారు లేరే? వినకున్న వినకుందురుగాక. పైఁగా

గీ. తాళ్ళపై రువ్వి, దుష్టక ♦ ర్రిలను దాల్చి
కొట్టఁగా దొమ్మిగావచ్చి ♦ తిట్టి పురము
వదలి వెళ్ళెడిదాక దు ♦ ర్భర దురంత
కార్యము లొనర్చుచున్నారు ♦ కలుషమతులు.

ఈనవనాగరీకతాభ్యాసమునకు లొంగిన కొందఱు యువకులీ దురభ్యాసమునకు లొంగి

శా. నిద్రాహారములన్ త్యజించి ధనమం ♦ తేపాలిగాతుల్యంబుగా
భద్రింబొక్కఁగదాచి పెద్దలిడు స ♦ ర్వస్వంబుక్షీణింపఁగన్
క్షుద్రప్రక్రియ మద్యపానమునకున్ ♦ భోగంబులం జిక్కి గృహ
చ్ఛిద్రంబైనను లెక్కఁజేయక యె వె ♦ చ్చింపంగఁజొచ్చెన్ గటా!

ఆహా! ఈ సురాపానీయము దేశమునంగల ప్రతి పట్టణంబును పల్లెలందును విరివిగా నల్లుకొని భారతీయులగౌరవకీర్తుల నాశన మొనర్చుటయే గాక మితిలేని దారిద్ర్యంబును గుంజుకొనుచున్నయది గదా! దారాసుతాదుల వస్తువాహనంబుల సంగ్రహించుకొని యర్పించుకొను వారు కొందఱు. పవలంతయుఁ గూలినాలిఁ జేసి దారాసుతాదులఁ బస్తుంచి వ్యయపెట్టువారుకొందఱు, పూర్వార్జితముల నాశ మొనర్చి కొంపలార్చుకొనువారు గొందఱు. అక్కటా! రాను రాను దేశమెంత యధోగతిలోనికి వచ్చినది, ఈమత్తువస్తువులు.

గీ కోట్లకొలఁదిగ ద్రవ్యంబు ♦ గుంజుకొనుచు
గర్భదారిద్ర్య మనెడు సా ♦ గరమునందు
ముంచుటను దేశమాత కృ ♦ శించి సుతుల
ప్రిల్లదనముల కెంతయో ♦ వగచుచుండె.

ఈనిర్భాగ్యులు కుత్తుకనిండఁద్రాగి వీథులవెంటఁబోవుచుఁ జేయు వికారపు చేష్టలఁ దిలకించుచున్నప్పుడెల్ల నాహృదయము కటకట పడక మానదు గదా!

గీ॥ ఒడలిపైబట్ట క్రిందనే ♦ పడెనో భుజము
పైననేగలదో! సుంత ♦ యేని తెలియఁ
జాలనంత దుస్థితినుండి ♦ గోలఁ జేసి
కొనుచుఁ ద్రోవల కడ్డుగాఁ ♦ జనుచు నుంద్రు॥

గీ॥ నీతిజాతి విసర్జించి ♦ బూతులాట
మొదలు పెట్టుచుఁ గనఁ బడ్డ ♦ సుదతినెల్ల
పిచ్చిప్రశ్నలనుఁ జేసి ♦ యిచ్చలవిడి
పరుషముల నాడుచుందురు ♦ దురితులగుచు॥

గీ॥ రోడ్లపై దొర్లువారి స ♦ ర్దుటకువచ్చి
బొడ్డులందునఁ గల్గు డ ♦ బ్బులను నూడఁ
దీయువారు పరామర్శఁ ♦ జేయువారు
కొందఱగుపించుచున్నా ♦ ర లెందుఁగన్న॥

ఇట్టి దౌర్భాగ్యులఁగన్న మాయమ్మ శాశ్వతవిచారసాగరంబు మునింగియున్నదన్న నాశ్చర్యమేముండును. ఈమద్య మెంతప్రభావముచే మాదేశంబునఁ దాండవమాడుచున్నది?

గీ మద్యమా! నీవులేని దే ♦ యుద్యమంబు
సాగఁ గాఁబోదు నీ దెంత ♦ సాహసంబో ?

కదను పెట్టిన నక్షత్రి ♦ ఫలముగాదె
వెలుగుచున్నావు దశదిశా ♦ వలయమందు.

గీ. ఎన్నికోట్లుగడించుచు ♦ నున్నఁగాని
తనివితీఱకు నీకు మ ♦ ద్యంబ! నీది
కడుపొ? లేకను జూడంగ ♦ ఖంసవల్లి
మడుగొ? యేదియుఁదోచద ♦ యొయ్యడిసివాళు,

దుర్మార్గచరిత్రుండగు గిరిమూర్తిగాడి సహవాసంబునుమఱఁగి సురానందుఁడు పూర్తిగాఁ జెడియెను. ఆబాల్యమిత్రుఁడను, రక్తబంధుఁడనన్న మాటయే మఱచెను. నన్ను మఱచిన నేమంతయుపద్రవము కాని!

గీ. తండ్రియార్జించియిచ్చిన ♦ కొండ్రిలెల్ల
వ్రాసియిచ్చె భోగముదాని ♦ వలపుదవిలి
స్నేహితులతోడఁ జేరి వ ♦ చ్చించెరొక్క-
మంతయును ద్రాగుటకును జే ♦ కాటలకును.

జానకమ్మ దీనాలాపములువిన్న నెవ్వనికంట నీరురాకుండును- ఆమహాపతివ్రతాశిరోమణినిఁ దిలకించిన నెవ్వానిగుండెలదరకుండును.

సీ. పెండ్లికాలమునందుఁ ♦ బెట్టిన నగలెల్ల
నూడగొట్టుకుపోయి ♦ యూడ్చిపెట్టె
పుట్టింటివారలు ♦ పెట్టిన నానుపో
చయు నెత్తుకొనిపోయి ♦ సానికిచ్చె
నల్లపూసలయందు ♦ నగల కాసును
పట్టుకుపోయిత్రా ♦ కట్టుఁబెట్టె
పెట్టెలోనున్నట్టి ♦ పట్టుచీరల నమ్మి
పేకాటలో నోడి ♦ పెట్టివచ్చె

గీ. నెన్ని చెప్పిన వినకఁ దా ♦ నెంత జేయఁ
దలఁచెనోయంత జేసి వృ ♦ ధాగఁ జెడియె

సర్వవిధములఁ జెటెనట్టి ♦ జానకమ్మఁ
నన్ను గుండె లవిసిపోవుఁ ♦ గాదె యకట.

(అటు నిటుఁ జూచుచు) అదుగో సురానందుఁడిటే వచ్చుచున్నాఁడు. ఈ దినమునఁ బూర్తిగా మందలించెదఁగాక—— .

సురా——(ప్రవేశించి) నన్నుఁజూస్తే అందఱికీ ఆగడమే. నాఆస్తి నేను పాడుచేసుకున్నా వీళ్ళకే. పెళ్ళాం నగలమ్ముకున్నా వీళ్లకే, బోగం దానికి మాన్యాలు వ్రాసియిచ్చినా వీళ్లకే. వీళ్ళ సొమ్మేమైనా పోయిందా? అయిపోయింది. బ్రాంది తాగే రోజులు. రిఫ్రెష్ మెంటురూపాయి పోకులు. పూర్తయినాయి. సారాసీళ్లల్లోకివచ్చింది. వ్యవహారం. రోజుకు రూపాయి దొరకడం కూడా కష్టములోఁ బడ్డది. ఎంతో నమ్మకంగా అంతా నీదే నీవేనేను నేనే నీవని చెప్పింది. దాన్నన్న పావ మేకుంది. తింటే తీస్నది. వెధవ మాన్యాలు. గీత బాగుండాలిగాని యెంతలో సంపాదించాలి. ప్పే రెక్కడకుఁ బోయింది. నాలుక పీక్కాని యెంతచచ్చినా నేను యిచ్చిన ఆస్తే నంటారా! ఇవ్వాళఁ బయటకు గొట్టిందేమో! తేపు యమధర్మరాజుగారి ముందు అనుభవించాలేమో వరుంది! ఇస్తి వాయనం. పుచ్చుకుంటి వాయనం. వాళ్లు బాగుపడ్డప్పుడు చూదాము. నాలుగురూపాయలు తెస్తే కాస్త దయదలచేలా గుంది. తేపునోములుఁ. ఎక్కడనుండి తేను? కన్నుఁబొడుచుకున్నా చిల్లిగవ్వ కనఁబడదు. అప్పిచ్చేవాళ్ళు లేరు. ఎవరిస్తారు. ఎరిగి వున్నంతవఱకీయరు. పై తాకట్టుపెట్టి ;టో పిదంచుతామంటే తూర్పుబండి తయారుగా వుంటుంది. అన్నట్లు మఱచిపోయాను. అంతా పోఁగా మంగళసూత్రం మిగిలి యున్నది. అది తెంపానా? బ్రతికివుండగానే తెంపనా? ఆమాత్రం తేలేని వెధవకు ముండే మిటంటారు గంజా——దెడి అమ్మినా పదిరూపాయలు వస్తవి. వెధవసారా పావలా దానితో మూతి ముంచితే యేమి మజావుం

టుంది? నాలుగుపోయినా ఆరుంటాయి. ఆనందంగా నాలుగు రో
జులు వెళ్ళుతుంది. మాధవుఁడు కొంపతీస్తున్నాఁడు. కనఁబడ్డప్పుడల్లా
పిలుస్తాడుగాని ఎట్లాగో తప్పుకుంటున్నా ! మాట్లాడాలంటాఁడు
ఏమి వ్యవహారాలున్నాయి. చకారగుళ్లకులంకించుకుందామనేగా
వాడి యేడుప్పు. ఈ దారినిఁబడి యిట్లాపోతే పత్తా చిక్కఁడు.

మాధ—సురానందా. సురానందా.

సురా—ఎవరాప్రిణాఁడు. అవశకునపుపక్షి. పనిమీద పోతూవుంటే
పిలుస్తాడు. బుద్ధి లేదు.

మాధ—నేను గాని క్షణము నిలుపుము.

సురా—నిలువరు.

మాధ—ఒక్క శేమాట. రెండు నిమిషములకన్న ఎక్కువ పట్టదు.

సురా—ఎందుకో చెప్పు.

మాధ—నే నెవరో గుర్తించితివా?

సురా—మాధవుఁడవు. పెత్తండ్రి కుమారుఁడవు. రుక్మిణమ్మకు సుబ్ర
హ్మణ్యా సోమయాజులకు కొడుకువు. నాకన్నవు. నాపెళ్ళానికి
బావవు. యిదేనామాట.

మాధ—తొందర లేదు. కొంచెము నిదానముగా మాట్లాడుము.

సురా—ఏడవవోయి. ఏడ్పేమిటో.

మాధ—నీభార్యకు బావగారినైన యిందుపదనకో.

సురా—అంతా దాన్ని చూచి యేడ్చేవారే. దానిపేరెత్తేవారే.

మాధ—దానినిఁ జూచి యేడ్చుట యెట్లున్నను నిన్నివిధమునఁ జూచు
టకు మాత్రము విచారించుచుంటిని. ఏమందువా?

ఉ. జంకవు చూచువారలక ♦ నహ్యముదోఁపఁగ నుంటివంచు లోఁ
గొంకవు రాత్రియుఁ బవలుఁ ♦ గూడను దాగుచు నుంటివంచునీ
వంకరచేష్టలన్ గని ఛి ♦ వాట్లను బెట్టెడువారి చూడవీ
వింకను బుద్ధిరాకఁ జరి ♦ యించుటఁజూచిన నేడ్పురాదొకో.

సురా—ఎవరిసొమ్ము : నానాయన సొమ్ము. నాకు యిచ్చెను. ఖర్చు
పెట్టితిని. నాసొమ్ము పోయినందుల కడుగుటకు మీకేమి యొక్క
న్నది?

మాధ—రూక్లేమియు లేకున్నను.

గీ. రక్తబంధువు తనదు న ♦ ర్వ్యసముదురిత
కార్యముల పాలు చేయుటఁ ♦ గనిన యొదవు
చింతచే యూరకొన లేక ♦ నింతబోధఁ
జేసి తామందుచుందురు ♦ చిత్తశాంతి.

సురా—చేశావు విన లేదు. నీకు చిత్తశాంతేగా కావల్సింది. పో.

మాధ—నాయనా! తృణీకరింపకు నా మాట వినుము.

గీ. త్రాగుడందు మఱగినవారు ♦ జోగులగుచు
సర్వవిధములచేత భ్ర ♦ ష్టతనుఁ గాంచి
యొందుసనుఁగాక చెడిన వా ♦ రెందరిలను
నల్లలాడుచునున్నారొ ♦ అరయుమయ్య.

సురా—దానిలో మహాత్తుఁ దెలిసికోకుండా వెధవ కభుర్లు చెప్పుతా
వేమిటిరా?

మాధ—తమ్ముఁడా! నీకుఁ దెలిసినంతగా నాకుఁ దెలియకున్నను
లోకానుభవమును బట్టి, జరుగుచున్న విచిత్రములను బట్టి, చూచు
చున్న విపరీతములను బట్టి నా తెలిసినంత వక్కాణించెదను.

సీ. లక్షలహారియిందు ♦ బిక్షుకునిఁ జేయు
దార్పుడుగత్తె యీ ♦ త్రాగుబుద్ధి
బలమెంతయున్న దు ♦ ర్బలుని గావించుచుఁ
దనువు దగ్ధముఁ జేయుఁ ♦ త్రాగుబుద్ధి
మానమున్నను గాని ♦ రోసంబు హారియించి
తలవంపుఁ దెచ్చునీ ♦ త్రాగుబుద్ధి

కులగౌరవముఁగాల్చి ♦ నలువురిలోన నిం
దలపాలు గావించు ♦ త్రాగుబుద్ధి
గీ. పూర్వులయశంబుబూదిలోఁ ♦ బూడ్చిపెట్టి
తెలివి తేటల దిగఁద్రావి ♦ దివ్యములగు
రూపములనూడ్చి నిత్యంబుఁ ♦ బాపకార్య
ములకు దారిచ్చు నీత్రాగు ♦ బుద్ధి నిజము.

మఱియు:—

గీ. తగనివ్యయముల మనుజులఁ ♦ దార్చి పెద్ద
చివ్వలంబెట్టి రచ్చలఁ ♦ జేర్చి రాజ
దండనల పాలుచేయు నీ ♦ త్రాగుబుద్ధి
తగదు తగదయ్య మనకిట్టి ♦ త్రాగుబుద్ధి.

నీవు వినుగుకొనియెదవని యింతతో విరమించుచుంటినిగాని లేకున్న నీత్రాగుడువలనగలుగు నరిష్టములనుగూర్చి చెప్పవలయునన్న దినములుచాల వన్ననతిశయోక్తిగాదుసుమా.

సురా—నీవెన్నాళ్లుబాగిచా నాబుఱ్ఱకెక్కదు. నామనసున కేదితోచిన నదిజరుగవలసిందే.

మాధ—నీమనస్సునకుఁదోచినదే యార్యమతసాంప్రదాయమని విశ్వసింతువా ? హితంబుల నాలింపవలదా ? భావిగతిఁ జూచుకొనవలదా ? ప్రపంచమునకు వెఱువవలదా ? భార్యయవస్థఁజూడవలదా? ఈదుర్వ్యసనమునఁజిక్కి చెడిపోయిన వారిచరిత్రలవినియైన బుద్ధిఁ దెచ్చుకొనవలదా ? అయ్యో ! వడసారము నుప్పదేండ్లు లేవే ! ఇంక నెంతయోకాలము జీవింపవలసినవాఁడవే. ఇంతియగాక

గీ. అగ్రవర్ణంబునందు వే ♦ దాధ్యయనప
రునకు జన్మించితంచు నీ ♦ మనమునందు

భీతివహియింపవలదె యీ ♦ రీతినీతిఁ
దక్క చరియింపఁగానౌనె ? ♦ తమ్ముఁకుఱ్ఱ,
నీతండ్రి నీకొఱకెంతకష్టపడియెనో యోజింపవలదా ?
గీ. సరిగఁదినలేదు మంచివ ♦ స్త్రమునుగట్టి
యెఱుఁగ డావిధగడియించి ♦ యింతధనము
భూమి, యిచ్చినఫలితమే ? ♦ బుద్ధిమాలి
సర్వస్వంబును నగ్గిపా ♦ ల్సలుపుకొనుట.

సురా—అవును, నాతండ్రి యిచ్చినాడు. చెప్పే మీబోటివాళ్ళంతా. ఆయనకు తద్దినం బెడుతున్నారా ? మీకుఁగూడా పెట్టలేదని యేడ్పుగామాల్ను.

మాధ—నాహితము నీకు వికటముగాఁ దోఁచినను, నీవు తిలయుఁ దోకయు లేని ప్రత్యుత్తరంబుల నొసంగుచున్నను, బంధుగుఁడ నగుటచేత, నీహీనస్థితినిజూచి జాలఁబొందుచున్నవాఁడ నగుటచేత చెప్పకఁ దప్పదు. నీకు విసుగు జనించునని మానుటకు వలను పడదు. మఱియొక విశేషము.

గీ. పెట్టుపోతల సంగతు ♦ లెట్టులున్న
గౌరవా గౌరవముల భా♦గమునుబంచు
కొనుటలో మేము నీబందు ♦ గుల మటంచు
లోకమును మాయనెంచైన ♦ మూఁకుడున్నె.

కాన,

గీ. చెడినదేమొ చెడితివి యింకఁ ♦ జెడకుమయ్య
తాగుడు తనంబిఁకనుమానఁ ♦ దలఁచుమయ్య
బంధుగులయందు గౌరవం ♦ బందుమయ్య
కులము, కీర్తిని నీతిని ♦ నిలుపుమయ్య.

సురా—ఏదీ ! అవమను. ఏగాడిదె నేను చెడ్డానంటాడో? మక్కెలు

విరగదంతాను. ఎక్కడో చాటున గడ్డితిన్నారని యంటే ఎట్లా? కాదయ్యా! చెడ్డానన్నుకో కాస్సేపు. చెడ్డచేనుకు మూడు మంచెలా? పోయిన ఆస్తి రాదుగదా? పోయినగౌరవం రాదుగదా? నాకు లేదు పెట్టుమని నేనుగాని నాపెళ్ళాంగాని నిన్ను యాచించలేదుగదా? ఇందాక నమ్మకంగావుందిగదా భోగంది. గుప్పెడు మెతుకులు నా మొగాన పారెయ్యదూ! నన్ను గూర్చి నీవేమో ఆయాసపడ్డనక్కరలేదు. ప్రొద్దెక్కింది దయచేయండి.

మాధ — అఖండ యశంబార్జించిన వంగడమునకెట్టి కళంకమాపాదించుచుంటివిరా!

గీ. సోమయాజులుకొడుకతి ♦ శుంఠయగుచుఁ
దాఁగి తిరుగుచున్నాఁడు ♦ భోగమింట
నన్నముం దినుచున్నాఁడ ♦ టన్న మాకుఁ
గలుగు తలవంపులింతని ♦ పలుకఁ గలను?

వర్ణభ్రష్టుఁడవై తిరిగినను పోనీ యనుకొందము. ఇంతయాస్తిని నమ్మకముగా వ్రాయించుకొన్న యా భోగముది యైన విశ్వాసవంతురాలా! ఎంత వెఱ్ఱివాఁడవోయి!

గీ. సర్వమంగళ మొనరించి ♦ సాని నీకుఁ
బోషణ మొనర్చునన్న న ♦ మ్మొటకు శక్య
మగునె? వినికని యెఱుఁగుదే ♦ యువనియందు
నట్టివారాకులాన ను ♦ న్నట్టివార్త.

గీ. సొమ్ము గోరిగెడిదాక మీ ♦ సొత్తటంచుఁ
బ్రాణములుమీవె యంచును ♦ బలికి పిదప
శునకమునకన్న హీనంపు ♦ చూపుఁ జూచి
వెడలనడిపింతురుగాదె రో ♦ వెలఁదులకట!

సూరా — ఇదుగో! అన్నా! నీమాటలువినలేదని నీకాగ్రహమువలదు. నాకర్మమెట్లున్న నట్లుజరుగును పోనిమ్ము.

మాధ—సురానందా! నీకుఁగోపమువచ్చిన నేఁజెప్పఁజాలనుగాని పాపము మఱదలు జానకమ్మ నీకొఱకెంత విలపించుచున్నదో నీకుఁదెలియునా ?

సురా—నాభార్యసంగతి నాకుఁగాక నీకెక్కువగాఁదెలియునా ?

మాధ—నాకెక్కువఁగాఁదెలియునిమాట వాస్తవమే గాని భార్యలనుసురుపెట్టుట మహాపాతకము. అట్టి యుసురుయొక్క ఫలితమును మనమనుభవింపకఁ దప్పదు. ఉదయంబున లేచి యామెముఖారవిందమును దిలకించినఁ బాపంబులన్నియుఁబటాపంచలగునే ? ఆమెనోట మాటవెలువడిన నమృతంబొలుకుచుండునే ? సురూపసంపదయే. సుగుణాఢ్యురాలే. అట్టి సాధ్వీలలామను సర్వవిధముల గొస్తుబెట్టుట మనకు ధర్మముగాదు. నామాటవినుము. చూడు. ఈవిచిత్రకాలమున నట్టికాంతలబ్బుటయే యరిది. అబ్బిన వారిని చక్కగా నేలుకొనక కష్టపరంపరల పాలుజేయుటవలనఁ దరతరంబులదాక నాపాపంబు గట్టిగుడుపుననుమా:—

సురా—ఇంతయుపన్యాసాలెందుకయ్యా ? నీకు వాగవలెనన్న చాలా చోటులున్నాయి. చాలామీటింగులున్నాయి. అక్కడకు వెళ్ళి లెక్చర్లియ్యి. వినను. నాయిష్టము మొఱ్ఱో అంటూంటే నీకేమిండితనమెందుకంటా !

మాధ—రక్తస్పర్శగలవాఁడ వింతవింటివిగదా ! ఇఁక వారువిందురు! ఈపాపకార్యప్రవాహ మిప్పుడాగునదికాదు. దీనికడ్డుకట్టయు లేదు!

గీ. ఎన్నఁడో సముద్రుఁడుపొంగి ♦ యింతపాప
మడచకుండంగమానఁడు ♦ హరిహరాదు
లెప్పుడో బనిఁబూని హ ♦ రింపకుండ
నుండరీభారతీయుల ♦ దుండగముల.

సురా — పోనియ్యవయ్యా ! అవ్వాను మీరంతా మిగులుతారు. మేము పోతాము. ఆస్వ రాజ్యమంతా మీరేలుకోండి నేనుపోతాను.

(నిష్క్రమించును)

మాధ — వీని జాతక ప్రభావ మిట్లుండ నెవ రేమి చేయఁగలరు?

శా. మాయాజాలమునందుఁ జిక్కువడి దు ♦ ర్మార్గక్రియాలోలుఁడై
అయిల్లాలి మొగంబుఁజూడఁడు సతం ♦ బల్లాడుచున్నన్ దనే
సాయంబున్ బొసరించఁ బూనఁడిటులన్ ♦ సంసార విచ్ఛిన్నమున్.
జేయన్ జాలిన వీని నేమనుదు ఛీ! ♦ ఛీ యింత దుర్మార్గమే.

ఏనుఁగు సింహాదు లున్నగు వన్యమృగంబులు నయితము కడు పార నీరంబులఁగ్రోలి జవసత్వంబులఁ బొందుచుండ మృగజాల మందులేని యీదురాచారము మానవుల పాలిట నెట్లు దాపురమైనదో ? హైందవాదర్శవిరుద్ధ కార్యాచరణమున మగ్నులమై యుండుట భారత మాతృవిలాపమునకుఁ గారణ భూతులమగుటయే గదా! యన్న విచార మొక్కరికేని యీసు లేకున్నదే ! వేదంబు లుద్భవించిన తావు. మహాఋషులజన్మలకు స్థానము, శ్రీరామ కృష్ణులు పుట్టినచోటు. హరిశ్చంద్రాది షట్చక్రవర్తుల పాలించిన నేల. రాజమాయాది మహాధ్వరంబులచే వెలుఁగొందిన భూమి. అభిమన్యాది వీరపుంగవులు తమ రక్తమును నిజదేశరక్షణార్థ మర్పించిన ప్రదేశము. అష్టాదశపురాణము లవతరించిన ధర ! ఇందుగల కర్మాధికార మెందును లేదే! అట్టి ఆర్యావర్త మిట్టియుగన్య్యభ్రాతలతో, యిట్టి తమ్ములతో, యిట్టి నిర్భాగ్యపు పెద్దమ్మలతో నిండి భూదేవికి భారమును గలుగఁజేయుచున్నారే! మొగంబులకు గుడ్డలడ్డముగాఁ బెట్టుకొని జందెంబుల దాచి తక్కుచుఁ దారుచు నటుల నందుగొందులఁబడి సారాదుకాణములకు బరువులెత్తుచున్నారే? ఇంత దొంగతనమేల ? సిగ్గు బిడియములు విసర్జించి యీ దుర్వ్యాసనలమధ్య, మా యుడును మొక్కల కాల్పుల

మధ్య, యాయపవిత్రస్థలముమధ్యఁజేరి త్రాగి తందనాలాడుచుఁ గుల గోత్రముల మఱచి యటుల వివిధకులజుల భుజములపైఁ జేతులువైచు కొని భాగవతము లాడుచున్నారే! ఆగ్రుక్కెడు నీళ్లు గొంతుకలోఁ బడిన పిమ్మట దొంగతనముగా దుకాణములలోఁ జొరఁబడుట లేనైనది. ఆహాహా! ఏమి వీరి మాఢ్యత? ఎందఱు కక్కుచుందురో? ఎందఱుమియుచుందురో- ఎందఱాతలంబునఁ బరమాసహ్యకరములగు పనులఁ జేయుచుందురో? తలంచుకొన్న యీ పెద్దమ్మల కొడళ్ళు జలదరించవు కాఁబోలు-ఖండఖండాంతరములనుండి వచ్చి మనలనుఁ జూచి, మనదేశమునుగాంచి, మనచర్యలాలించి-మన విపరీతదశ లవలోకించి-మనమాఢ్యత విలోకించి-మన తెలివితక్కువలఁ బరికించి హృదయములు కఱగునట్లు మొత్తుకొనుచున్నారే. అట్లయ్యు వారి రోదన మరణ్యారోదన మొనర్చి-సిగ్గులేక-మానాభిమానములఁ ద్యజించి-మొండితనము వహించి-కడద్రాగుచున్నారు. భరతమాత కాన్పు-నవ్వుల చేటు-తలవంపు-కనుహైన్యత, ఇట్లుచెడత్రాఁగి, యల్లరులకొఱకు. పోరాటములకొఱకు, విలాసముగా-దారి తెలియక వెఱ్ఱి గొల్లవాండ్రరీతి నాటకములఁ జూడవచ్చువారికి, భావగర్భితములై-రసమిళితములై- గీర్వాణసమాస పూరితములై యొప్పారు నాటకములో గావలయును? ఆదినంబులన్నియు మాయమైనవి. దైవమా! కన్నులఁ దెఱువవా! ఈదౌర్భాగ్యుల హృదయక్షేత్రంబులఁ బ్రవేశింపవా? పాపకృత్యంబుల మాన్పింపవా! ఈ యలవాట్లు వలన నెన్ని సంసారములు కట్టుగుడ్డకు తినఁదిండికి మోము వాచియున్నవో, ఎంతదరిద్ర్య మడుఁగంటి పోవుచున్నదో విచారింపవా? ఎన్ని ప్రాణములు గుండెలు మాడి హరియింపఁ బడినవో! యీ విపరీతజీవనములవలన నెన్ని ఘోరకృత్యంబులు ప్రబలి,ఎన్ని ప్రాణులు హింసింపఁ బడుచున్నవో తిలకింపవా! ఎందఱు ధనికులు బిచ్చగాండ్రై యల్లాడుచుండిరో చూడవా! ఓ! పరమేశ్వరా! చిత్ర విచిత్ర నాటకంబు

లాడించుచు, నీ యైంద్రజాల విభ్రమమును లోకంబునకుఁ జాటుచున్నావా! నాయనా! భగవానుఁడా! నీ వెఱుంగని దేది! నీకశక్యమగు కార్యమేది! ఇది యొక ఫక్కి భాగవతం బాడించుచున్నావు. కానిమ్ము. ఓ పరాత్పరా!

సీ. ధనమున్న వారి స్వాం ♦ తములందు సద్గుణ
బీజంబు వేసి మొ ♦ ల్పించవీవు
చదువుకొనిన వారి ♦ హృదయములను జేరి
సత్క్రియా పరులుగా ♦ సలుపవీవు
పాడిపంటలుగల ♦ వారిలోఁ జేరినీ
పై భక్తిఁ జూపుచుఁ ♦ బఱఁగనీవు
వేదోక్తులగు వారి ♦ వేద ఘోషలయందు
స్థిరబుద్ధితో నుండఁ ♦ జేయవీవు
గీ. పరమ తాచారములయందు ♦ వరలుటందో
సాధువులఁబట్టి హింసల ♦ సలుపుటందో
కొంపలనుగూల్చి ధనముఁ జే ♦ కొనుటయందో
వాంఛితులఁ జేతు నీవేమి ♦ చావుకొనెదో.

నీ యాంతరంగికోద్దేశ మేమియో గ్రహింప నశక్యమేగాని,

"క. ఇందుఁగలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి ♦ సర్వోపగతుం
డెం దెందు వెదకి జూచిన
నందందే గలఁడు దాన ♦ వాగ్రణి వింటే.

అని పోతనామాత్యుఁడు వ్రాసిపెట్టెనే. నిజముగా నీయందంత మహాత్మ్యమే యున్నయెడల,

ఉ. నేర మొకింత లేని తరు ♦ ణీమణియొక్క తె తల్లడిల్లఁగా
త్రిమ్మఁబోరుచు నీకిది భ ♦ రించుట దుర్భరమౌనెకో దీనముం

దాతాఁడనన్న పేరు వసు ♦ ధాస్థలి నిల్పఁదలంతువేని నీ
కారుణికత్వమిప్పుడిటుఁ ♦ గానఁగఁ జేయఁగదయ్య మాధవా.

కొండన్న—(ప్రవేశించి) అయ్యా ! మాధవయ్యగారు, 'జానకమ్మో రుశని యేమైందో యిన్నారా మారాజా ?

మాధ—(ఆతురతతో) ఏమయిందిరా ! తొందరగఁ జెప్పు !

మాధ—సురానందయ్యగారి యిల్లు బారఁయ్యెచెట్టిగారొప్పగించుకొడాని కొచ్చారండి. అమ్మగారన్నదిగందా ! అయ్యగారొచ్చా కల్లానందాండి. ఆమారాజేసున్నాఁడో ! ఆకోవఁటి యున్కుండా యింట్లో దొరపాడి సెంబు తెప్పాళా బైట. శారనూక్కి యింటికి తాళమేసిండంఁడి. అమ్మగా రాకిట్లోకూకుంది. యేడుత్తోంది. నేవా దారినెల్తుంటే పిల్సి మాదవయ్యగారితో సెప్పి మెట్టు నాయినా అంటే లగెత్తుకొచ్చినా !

మాధ—హరిహరీ ! ఎట్టిసంసారమునకెట్టితిప్పలువచ్చినవి !

గీ. తరతరంబులదాకను ♦ దరుగనట్టి
యాస్తిగలిగిన సంసార ♦ మడఁగి తుదకు,
నిలువ నీడయు లేకుండఁ ♦ గలిగెనట్లు !
యింత ఘోరంబులున్నవే ♦ యేడనైన.

దైవమా ! ఎంతనిర్దయుఁడవై పోతివి !

మ. కుడువన్ గూటికి లేకఁబోయినను లో ♦ కల్ జూడకుండంగ లో
బడియుండంగల కొంపగూడసరిగెన్ ♦ బావంబికేదారి ? యె
వ్వఁడు జాలిన్ గనిఁయాదరింపఁ వడతిన్ ♦ భారంబుగాఁదోఁచి యి
వలతున్ద్రోసిన నీకు నెక్కుడిదయా ♦ పారింభవిస్రంభముల్.

ఇంత యుక్తాయుక్తవిచారశూన్యుండవగుదువని దలంచకపోయింగదా ! ఓ కరుణామయా !

గీ. మగఁడు ఆరీతి వేధించి ♦ మాన్పుచుండ,
యాస్తి సర్వంబు క్షీణించి ♦ యడలుచుండ
కఠినతనుజూపి నీవును ♦ గాసిఁబెట్ట
జగతి నేరీతి మనును మా ♦ జానకమ్మ.

సీ. తనయాస్తిసర్వంబు ♦ దగ్ధమైపోయినఁ
గినుకఁబూనని యట్టి ♦ యనఘురాలు,
పతియెంత నీచంపు ♦ గతిఁ జూచినను గాని
పరిచర్యమానని ♦ భవ్యరాలు
కూడుగుడ్డకును గా ♦ కుంజెందినను గాని
యొరులకుఁదెల్పని ♦ యోగ్యురాలు
తనకుఁ దెల్సినదెల్ల ♦ తనతోడివారికిఁ
దెల్పి సన్నుతులందు ♦ దివ్యురాలు
గీ. పరులు తనవారనెడు భేద ♦ మెఱుఁగకుండ
సమముగా నాదరించెడి ♦ సదయురాలు !
దిక్కులేమిఁ సల్లాడెడు ♦ ఫక్కిఁజూచి !
మిన్నకుండెద వేమి స్వా ♦ మీ! రమేశ.

కొండప్పా ! ఇంకా జానకమ్మగారచటనే యున్నదా ? ఎవరును వచ్చి తోడ్కొని పోలేదా ?

కొండ—ఆదరించ కేమిలెండి. ఈచంగతంతా మీభార్యగారిందంట. వొచ్చి తీస్కెల్లిందండి. సామీ ! అంతా గొడ్డుమోతోళ్ళుంటా రాండి ? ఇదంతా నండి దాయాదాళ్లు చేయించారంటండీ. పుకారడ్డది వూరంతాను.

మాధ—కొండా ! ఇంత పిచ్చివాఁడవేమిరా ?

గీ. ఐక్యమత్యమె యున్న, దా ♦ యాదులందు
ద్వేషభావంబె లేకున్న ♦ దేశమందు

జాతిమతకక్షలేకున్న ♦ క్షణికమందు
రాక యుండును మనకు ♦ స్వరాజ్యపదవి.

మఱియు,

గీ. తాగుబోతుఁదనంబు, జూ ♦ దంబుఁ, గూట
సాక్ష్యము, లసూయయును, వ్యభి ♦ చారతనము
చౌర్యము లివన్నియును మాన ♦ జాలి లేని
గలుగవిక్కట్లు భారత ♦ ఖండమునకు.

కొండప్పా ! నాతోఁగూడ రారా !

కొండ—చిత్తము, నడువండి.

మాధ—ఓ పరమాత్ముఁడా ? వాసుదేవా ?

సీ. ధర్మమందాసక్తి ♦ తగ్గిపోయెను జీవ
హింసయందాసక్తి ♦ హెచ్చిపోయె
సూనృతంబు నశించె ♦ శుంఠలు హెచ్చిరి
మతదూషణంబు సం ♦ తతము మీఱె
కులగౌరవంబులు ♦ గూలిపోవుచునుండె
గూటసాక్ష్యంబుల ♦ పాటహెచ్చె
మద్యపానోద్యోగ ♦ మహిమ పెంపొందుచు
నుండె దొంగిల్పుతో ♦ నిండె జగతి
నావిపరుమలు పమ్మెయ్యె ♦ దేవ! నీదు
పూజలునశించె భరతోర్వి ♦ పూర్వయశము
బూదిపాలయ్యె మాకు ది ♦ క్కేదియింక
నీవగాక దయామయా! నీరజాక్ష.

దేవా ! వాసుదేవా ! దారిద్ర్యవాతావరణమునఁ జిక్కి విల
పించు భారతీయుల నుద్ధరింపుము, ఉద్ధరింపుము. ఉద్ధరింపుము.

(అని యిర్వురు నిష్క్రమింతురు.)



శ్రీ

# సురానంద

పంచమాంకము.



(మాధవరావు గృహమున నేకాంతముగ జానకమ్మ ప్రవేశము.)

జాన—(స్వగతము) అక్కటా! నామనోహరుఁ డింతటి యవినీతుఁ డగునని స్వప్నమున నైన నెఱుఁగుదుమే?

సీ. కూడుగుడ్డలకు నెట్టి ♦ కొదువలేకుండంగఁ
గలవిన్ని మడిమాన్య ♦ ములని దలఁచి
సద్గుణంబుభయ భా ♦ షల నేర్చినాఁడార్జ
నంబున లోటులుం ♦ డవని దలఁచి
పిన్నవాఁడనె వీరి ♦ వినయప్రవృత్తులు
ముదముగొల్పెడినంచు ♦ నెదదలంచి
చీమచిటుకుమన్నఁ ♦ జేరువగానుండు
నల్లుఁడంచును బ్రేమ ♦ యమునఁ దలఁచి
అడిగినట్లుగఁ గట్నంబు ♦ లమరనిచ్చి
పన్నిడి వివాహమొనరించె ♦ నాదుతండ్రి
కాని యిటులౌటస్వప్నమం ♦ దేనిఁదలఁప
రయ్యొ వారేమి దైవము ♦ లా? దలంప.

భగవానుఁడా! నీచెయ్దము లెట్టివో గాని యెంత యాస్తిని బూదిఁ గల్పించితివి? ఎన్ని ధాన్యరాసులను హరింపఁ జేసితివి? ఎట్టి గృహము నుండి వెడల నడపించితివి? పూర్వఁపు స్థితిఁ దలంచుకొనినపుడెల్ల గర్భనిర్భేదక మగును గాని సామాన్యమా? అంతటి

సిరిసంపద లఱుగంటినను పట్టెడన్నంబునకును కట్టుబట్టలకును గూడ మోముచాయునంతటి దుర్దశనా నాకు గల్పింతువు ? దయామయా ! గతజలసేతు బంధమునకై పగవనే ? అతిసుకుమార జీవితంబును గడు పనర్థింపనే ? ఆర్యమత సాంప్రదాయ విరుద్ధం బీసురాపానీయమని, భారతజాతి కగౌరవమని, అగ్రివర్ణంబునందు దలవంపని, నామనోహరుని యంతరాత్మఁ బ్రవేశించి ప్రబోధించి సన్మార్గశీలునిఁ గావించి యగ్నిసాక్షిగఁ బరిణయంబై, స్వకులధర్మంబుల బాటించుచుఁ, బతిసేవ యేమహా భాగ్యంబని విశ్వసించుచు, వానితోడిదియే లోకంబని గట్టిగా ముడివైచుకొని జరించునన్ను నాపెనిమిటి యనురాగమునకు-వాని దయకుఁ బాత్రురాలనుగ నొనర్చి యుద్ధరింపు మంటిని. కరుణామయా ! ద్రౌపదీ మానసంరక్షణాది ఘనకార్యంబులొనర్చినవాఁడవు. నీకీ కార్యంబొక లెక్కయా! నావలన నే యపరాధమును గనిపెట్టి నన్నీ విధి గాసిపెట్టెదవు చూడు.

ఉ. ధాన్యపురాసులెల్ల వెల ♦ దారగృహంబునఁ జేర్చువాఁడు తా
మాన్యము వ్రాయునాఁడుపది ♦ మందిని గూర్చుకఁ ద్రాగునాఁడు: కా
ఠిన్యముఁ బూని బాకయి శ ♦ తించినవాఁడు హృదీశుఁడన్న నే
నన్యముగాఁ దలంచను గ ♦ దా ! జగదీశ్వర! నీవెఱుంగవే.

అక్కటా ! జీవితేశ్వరా ! మీకింతటి మౌఢ్యమేల ? ఇంత ఘోరకలి యేవర్ణంబునందును లేదే. చేతనింత ద్రవ్యమున్నంత వఱకు బ్రాందితాగితిరి. కలిగిన మాన్యంబుల నెల్ల వేశ్యకు ధారపోసితిరి. అప్పు తెచ్చి తప్పుకూడన్నటుల ఋణములఁ జేయుచు సారాయము త్రాగుచుంటిరి. అయ్యో ! చివఱకు మద్యమా ! ఆహా ! ఏమి విపరీతము. పోనిండు. ఏ వ్యవహారము లెట్లున్నను యింటికి వచ్చి భోజనముఁ జేయుటకైనఁ దీఱిక యుండదా ! ఓ మనోహరా ! మీ రాక కొఱకుఁ దపించుచున్న యీ దీనురాలి యెడల మీకింతవఱకు యీషణ్మాత్రమేనియు జాలి జనింపకుండుట నా పాపపరిపాకఫలంబు గాక వేఱేమియుండును.

ఓ ప్రాణపతీ, ఎందుంటిరో గదా ? కడుపున కింత యన్న
మైనఁ దినుచుండిరో లేదో గదా ? పరుండుటకైన నావేశ్యగృహం
బునఁ దావొసఁగుచున్నదో లేదో గదా! వట్టిమాట. చేర్చదు.
చేర్చదు.

గీ. మేడలోఁ దూగుటుయ్యాల ♦ మీఁదఁ జేరి
హాయిగా నిద్రపోయెడు ♦ ప్రాప్తి కలుగఁ
గానులేనట్టి నాపతి ♦ గతికి జాలిఁ
జెందివిశ్వాసమున నింటఁ ♦ జేర్చునొక్కొ.

గీ. "తెమ్ము తెమ్మన్న రీతినిఁ ♦ దెచ్చియిచ్చి
సర్వమును గూర్చె నేని వి ♦ శ్వాసమింత
యేని లేకుండ గౌరవ ♦ హీనుని బలెఁ
జూచె నాకాంత యిదియేమి ♦ చోద్యముగద.

అని వారము దినముల క్రిందట వాకిట్చిన ప్రాణేశ్వరుఁ డాగుమ్మ మింకఁ ద్రొక్కునా? భారతియ్యాశెట్టి యింతటి పనికి దొర కొనెనని పాపమాయనకుఁ దెలిసెనో లేదో! తెలిసినమాత్రమేమి చేయఁగలరు? పాపము మాపాలిఁట భగవంతునివలె మాధవరావు గారింత సాయమొనర్చకున్న గతియేమైయుండునో! ఓతల్లీ! భార తాంబా! ఒక్కసంసారం బిటులఛిద్రంబయినందులకే వేఱుగతిఁ గానక యిట్లల్లాడుచుంటిమి. కోట్లకొలఁదిగఁ బుత్రులఁ గనిన నీవు యిట్టిమాధ్యులఁ గనినందుల కెంత సంతాప పడుచుంటివో! ఏమని బొగలుచుంటివో! ఏవిధంబుగ గుండె రాయి చేసికొంటివో గదా? అమ్మా.

ఉ, రాళ్ళను ఱువ్వఁబూనుట గు ♦ రంతరులై మితిమీరి త్రాగి యం
గళ్ళను గొల్లగొట్టుట వి ♦ కావికనవ్వుట దోళ్లదోపుగా
బళ్ళను నడ్డగించుట స్వ ♦ భావము లౌనటుఁ జేయుత్రాగుటం
గళ్ళ వినాశమెన్నఁడు జ ♦ గత్థలిఁ గల్గునో భారతాంబరో.

ఏది యెటుల నూడ్చి పెట్టుకొనిపోయినను యిప్పుడేని నీనీచవృత్తిని విసర్జించుదమన్న యాలోచనము లేక పోవుట నా ప్రారబ్ధము గాక మఱేమగును. ఆహా! ఈ నా శరీరమును జూచుకొని యేమని విలపింతును,

సీ. అదిలేదు యిదిలేద ♦ టంచుఁ జెల్వఁగఁబోవ
మూలలరోఁకలిఁ దెచ్చి ♦ మోదుచుండు
వస్త్రహీనఁగనుండి ♦ వసనముల్ దెమ్మన్నఁ
జేవచువ్వతో వీపు ♦ బెట్లఁగొట్టు
సంసారమందు ల ♦ క్ష్యముఁ జూపుమని వేడఁ
జీపురుకట్టతోఁ ♦ జెండుచుండు
మాయత్రాగుడ లేని ♦ మానుఁడీయని దెల్ప
బండబూతులఁదిట్టు ♦ చుండునకట

గీ. అగ్రవంశాన జన్మంబు ♦ నంది యిట్టి
హేయవృత్తికి దార్కొని ♦ యిన్ని గతులఁ
జెట్టలను బెట్టుచున్న దః ♦ శీలుఁడైన
పతిగతినిగూర్చి యెంతగా ♦ వగచుదాన.

మాధ—(ప్రవేశించి) అమ్మా! జానకమ్మా! ఇక్కడ నొంటరిగ నేమిచేయుచుంటి వమ్మా!

జాన—(కన్నులఁ దుడుచుకొని) అయ్యో! ఊరక నే కూర్చుంటిని.

మాధ—విచారపడు చున్నట్టులున్నావే?

జాన—విచార మెందులకు?

మాధ—జానకమ్మా! నీ విచారమే నెఱుంగనిది గాదమ్మా! అయినను మనమేమి చేయఁగలము? చెప్పవలసి నంత చెప్పి చూచితిని. వినఁడయ్యె. మీఁదు మిక్కిలి క్రొత్త ముప్పొకటి దెచ్చి నెత్తిని బెట్టుకొనియె.

జాన—అయ్యో! ఏమది.

మాధ—(తనలో) ఈవార్తవిన్న మఱింత విచారపడునేమో! అట్లనుకొని యూరడిల్లు టెట్లు? (ప్రకాశముగా) తల్లీ! జానకమ్మా! బారెయ్యశెట్టి యిల్లువప్పగింత పెట్టుకొని కాపురమున్న వార్త నెఱుఁగుదు కాఁబోలు. నీవాయింటనే గలవనియో నిద్రించుచుంటి వేమో యనియు గడియకన్నంబు వైచి లోనికిఁ బ్రవేశించి యాతని భార్య మెడలోని యాభరణముల లాగుచుండ నామె మేల్కాంచి కేకలు వేయునరికిఁ బెనిమిటి లేచి పట్టుకొని రక్షకభటుల వశ మొనర్చెనఁట.

జాన—(గుండెలు బాదుకొని యేడ్చుచు) ఆహా! మనోహరా! చివఱకు మీకీ దుర్బుద్ధిగూడ బుట్టినదా?

గీ. కుడువఁగూటికిఁ గట్టంగ ♦ గుడ్డకును బ
రుంట మంచంబునకు నిలు ♦ చుంటకిల్లు
లేకపోయినఁగాని యీ ♦ లీల దొంగ
తనమునకుఁ బాల్పడుట మీకు ♦ ధర్మమగునె.

అయ్యో, ఇంతదనుక నిట్టి యకార్యంబు లెఱుంగరే. మీరు హస్తంబులకు సంకెళులఁ దగిలించుకొని యీరీతి బంధనాలయంబున బరగుచుండ నేరీతిఁ జూడఁగల్గుదును? హా! ప్రాణపతీ! చివర కీతలవంపుకార్యముఁగూడఁ జేసితిరే! నాకడ కేవచ్చి యడిగినఁ బసుపుకొమ్ము గట్టుకొనియైన నీమంగళసూత్రంబిచ్చియుందునే? ఇప్పుడింకేదిగతి.

మాధ...అమ్మా! విచారపడకుము. జానకమ్మా! నీపెనిమిటికివచ్చిన భయము లేదు. నీభర్తనుగూర్చినవిచారము నాకుమాత్రము లేదా? కర్మానుభవము నెవ్వరుతప్పించఁగలరు?

జాన—ఆప్తబంధువులైన మీకుఁగూడ విచారముండుట స్వాభావికమేగదా కాదనియనఁగలనా? కాని!

మ. సుతులున్నారని సంతసింపవలెనో ♦ శోకింపకుండంగ నా
పతిసాన్నిధ్యమునందునుంటి నిఁక లో ♦ పం బేమి లేదంచు సం
తతమాహ్లాదముఁ జెందుచుండవలెనో ♦ దైవంబు మన్నించి నా
స్థితివీక్షించి సహాయుఁడయ్యెనని నా ♦ చిత్తానరంజిల్లెదో.

ఏవిధి ధైర్యంబుగ నుండఁగల్గుదును. దేవా! ఈస్థితియందు ఆపదుద్ధారకులై ప్రాణసంరక్షణ మొనర్చుచుండిరిగదా యని యీమాత్రముగనైన జీవచ్ఛవంబనై యుంటిని. లేకున్న యీపాటికే యేనూయియో గోయియో చూచుకొనియుందునుగదా!

ఉ. వావికి బావలయ్యు నిట ♦ వచ్చినదాదిగఁ బితృతుల్యులై
దేవ! భవత్కృపారసము ♦ దివ్యముగాఁ గనఁజేసి లోటుపా
ట్లేవియుఁ గల్గకుండ భరి ♦ యించిన మీసుగుణప్రవృత్తికే
నేవిధి నాత్మయందు స్మరి ♦ యింతును ఆహరిసాక్షియయ్యెడున్.

అట్టి యాదరణమే నాయందిప్పుడు గూడనుంచి, సిగ్గువిడచి, మీ నేత్రములయెదుట నీవిధి కన్నీరు మున్నీరుగా విలపించుచున్న నాదీనగతిని యోజించి యొక్కపరి నాభర్తను కన్నులకుఁ గాన్పింపఁజేయుఁడు, మీపాదంబుల ముట్టి వేడుచుంటినని యనుకొని యాదరింపుఁడు. మీరును జూచుచునే యున్నారుగదా! ఇంత హైన్యదశయందున్నను దాయాదులు జూపుచున్న మాత్సర్యము? ఇదియంతయు వారి పన్నాగమే గదా?

మాధ—తల్లీ! అదియే వెఱ్ఱి. ఒక రొనర్చునదేమి: దైవవంచన వలనమనుజుఁడు లొంగునేగాని మనుజవంచన మనుజుని నేమియుఁ జేయఁజాలదమ్మా!

గీ. మనకు దినములు చెడ్డవా ♦ టను నితరుల
దూషణ మొనర్చుటలు గొప్ప ♦ దోషమమ్మ
కాలమెప్పుడే యేరీతిఁ ♦ గడువఁగలదొ
తెలియఁగా రాదు సుమి బ్రహ్మ ♦ దేవునకును.

నీభర్తను నీకన్నుల కగుపఱచుట లోకగొప్పకార్యము కాదు. ఇప్పటికాలపు కావలిభటుల నేమూలముననైనఁ దృష్టిపఱచి జూచిరావచ్చును. కావున విచారపడక ధైర్యమవలంబించి లోనికిఁ బోవుదము రమ్ము! భోజనము వేళ కాలేదా ?

జాన— రాకేమిచేయుదును ?

గీ. మూర్ఖుఁడై భర్త యారీతి ♦ భోజనంబు
మాటయేఁ జూచుకొనకుండ ♦ మసలుచుండ
పాపినై పాడు పొట్టకు ♦ ప్రాణమింత
వోసి బ్రతుకుచు నున్నాను ♦ బుద్ధిలేక.

మాధ— అబ్బా ! అవన్నియు మఱచిపొమ్ము— వెందలకడ భోజనముఁ జేసి పోయి వానిని చూచివత్తము రమ్ము—

జాన— చిత్తము. (అని నిష్క్రమించును.)





శ్రీ

# సురానంద.

## షష్ఠాంకము.

సురా—(స్వగతము) అక్కటా! ఎంత విపరీతదశకుం బాల్పడితిని?

గీ. నల్వురును ఛీయటంచును ♦ నాకునోట
గడ్డి పెట్టిసఁగాని ల ♦ క్ష్యంబులేక
తాగి, వేశ్యాగృహంబుల ♦ కేగి వట్టి
దేబెనైపోతి నా తెల్వి ♦ తెల్లవాఱ.

గీ. బ్రాహ్మణాన్వయమున జన్మ ♦ బడసి యార్య
కులపుధర్మంబులగ్గిలోఁ ♦ గూలఁద్రోసి
హీనవృత్తికిఁ దార్కొని ♦ యీవిధాన
పాతకుఁడనైతి చెఱిలోనఁ ♦ బడితిఁ దుదకు,

గీ. సర్వమును క్షౌరమయ్యె య ♦ శంబుపోయె
బందుగులయందు నిందలఁ ♦ బడఁగనయ్యె
చదువుకొన్నట్టి చదువు నా ♦ శంబునయ్యె
చివఱకీరీతిఁ జెరసాలఁ ♦ జేరనయ్యె.

గీ. ఎటుల నాపాలఁబడెనొ యీ ♦ కుటిలచరితుఁ
డైన గిరిమూర్తిగాడిది ♦ యలపడంగఁ
జేసి తాఁ జెడుటయెగాకఁ ♦ జెఱచెనన్నుఁ
గూడ నీరీతి యేడ్చుచు ♦ న్నాఁడుఁధుదకు.

ఛీ! ఛీ! ఒకరిని నిందింపనేల?

సురా—అయ్యా! నేను మాట్లాడనుగాని నాకొక్క సాయము మా
త్ర మొనర్పుము. నీమేలు మఱువను.

బంట్రో—ఎట్టివోయ్.

సురా—గీ. ననుగురించి గుండెలు బాదు ♦ కొనుచు నెవ్వ
రేనివచ్చినచో నేవి ♦ ధాననేని
నాకుఁ జూపించగోరు చు ♦ న్నాఁడ నిన్ను
ముట్టఁజెప్పుదు రేదైన ♦ ముదముఁ జెంది.

బంట్రో—దాన్కి యేమీ ఫర్వాలేదువోయ్. నీది ప్యారీ వస్తాది అంటార్ అయితేసరి. ఇనాం దియేతో మాదీయేమ్ పోయిందివోయ్. ఖానీ చురానందుల్! మాఖీఖుర్గా మే హాల్లా సారామల్లి బరాంది యిప్పిపియేతో సువ్వర్ ది ఘోష్ తిన్నహాంతద్ సంపుంది హైసా బోలేతో బామ్మన్ వుండాది భ్యామ్మల్ బిల్లగోచి పెట్టి ముఖాల్ బూడ్డె తల్గించి యేట్టి యేట్టివో నత్కుతార్ గందా! ఖంచన్కి ఫీనాకె డబ్బుహాంతా హాజామత్ చేసి అయ్యవారిలాఖు ఖూకుంటే పెళ్ళాం బిడ్డల్ హెట్లా బత్కావాలా అనుకున్నావ్. హెంత మొండివి వోయ్.

సురా—సాహెబూ! గతమును జ్ఞప్తికిఁ దెచ్చి యేల నేడ్పింతువు?

గీ. మూర్ఖుఁడను గానె నేర్వ ♦ మును వృథాగ
పాడుగావించి యీరీతి ♦ భ్రష్టుఁడ నయి
భార్య నేడ్పించుచును నింక ♦ వసుధయందు
బ్రతుకుచున్నాఁడ జీవచ్ఛ ♦ వంబ నగుచు.

అయ్యా! నాకు రాత్రి నిద్దుర లేకుంటచే బడలియున్నాఁడ. ఇంచుక విశ్రమింతును.

బంట్రో—అచ్చా! సోజావ్.

(సురానందుఁడు పరుండును. బంట్రోతు పహారా యిచ్చుచుండును.)

(మాధవుఁడు జానకమ్మయుఁ బ్రవేశించును)

మాధ—అమ్మా! జానకమ్మా!

గీ. అదియె చెఱసాల నీవు నె ♦ మ్మదిగ రమ్మి
పరులఁజూచిన నంసుగా ♦ వలిసిగాయు
వానికా మాటవచ్చును ♦ భంగమగును
మనము చూడఁగవచ్చిన ♦ పనియుఁగూడ.

మఱియు నొక సంగతి,

గీ. వానిఁగని తటాలున గుండె ♦ బాదుకొనుచు
నేడ్వఁబోకమ్మ! సినుఁజూచి ♦ యేడ్చువాఁడు
గూడ నిర్వేరు నొకతూరి ♦ ఘొల్లుమనిన
వానియగు పిమ్మటను దూర ♦ కమ్మనన్ను.

జాన—ఆర్యా! అట్లనే ధైర్యమున నుందునుగాని నా హృదయేశ్వరుఁడేడీ!

మాధ—అడుగో! మెల్లగఁ జూడుము,

గీ. మట్టిఁగొట్టిన రొయిడలితో ♦ మాసినట్టి
బట్టతో చిక్కి సగమైన ♦ పొట్టతో వి
రించి వ్రాసిన వ్రాతఁ ద ♦ లంచుకొనుచు!
నిద్రఁ బోవుచునున్నాఁడు ♦ నేలమీఁద.

నీ విచ్చటనే యుండుము. ముందుగ నేను వీని లోఁబఱచుకొని వానిని లేపుదును.

జాన—చిత్తము.

మాధ—ఏమండి సాహెబుగారు.

బంట్రో—కోన్ హైతుమ్. గడబిడ్ కర్ నకో జావ్.

మాధ—కొంచెము శాంతింపుఁడు. మీకు జీతమెంత ?

బంట్రో—ఎంతా అండీ, పన్నెండు రూపాయల్ యిస్తారు. ఖర్చో కాలములో పిల్లల్కూ మేకల్కూ హేట్టాబత్కా-వాలా పంతుల్ సాఫ్. యెన్కటి రోజుల్కూ గోజుడైరీకి నాల్గుసూసెన్సల్ రాపిస్తే ఆదా రూపాయి వస్తుండింది. ఇప్డూ దేశం అంతా తెల్గుమీరింది ఘుటాక్కా దిగ్గు.

మాధ—నాకొక సాయమొనర్పవలయును (అని చేతిలో నేదియో పెట్టుచు) సాహేబు ! ఈబిడ మా మఱదలు. సురానందుని భార్య. ఈతని దుస్థితిని గూర్చి విని ధైర్యమును జిక్కఁ బట్ట లేక చూచి పోవుదమన్న భ్రాంతిచే నిటు వచ్చినది. దయవుంచి యించుక తడవు మాట్లాడనిమ్ము.

బంట్రో—మా ఖోలీమనా డుండామా లేదు. ఆడ్కి ఘూంచెం ఘూబ్రాచేస్తాద్ గాని అది ఖాస్త చేతిలో దా లేతూ ఆకుట్టుల్ గిలకటుల్ అన్ని నఫాయి చేస్తాది. మీకేమాట సేస్కూంటే మాక్షో యింది లేదు. జావ్ పర్వానై.

మాధ—అయ్యా ! నీవు కడు మంచివాఁడవు. పిల్లలఁ గన్నవానికి జాలియుండదా ! (తనలో) ధనములోనున్న మహత్తు మఱి యొక దాని యందు లేదుగదా !

గీ. కఠినునైనను తృటిలోనఁ ♦ గరగఁజేసి
రాజ శాసనములను ది ♦ రస్కరించి
తగిన స్వాతంత్ర్యమును దార్చి ♦ తప్పుదారి
యందుఁ ద్రొక్కించుమాహాత్మ్య ♦ మందుఁగలదు.

(కొట్టువద్దకుఁ బోయి) సురానందా!

సురా—(లేచి మాధవునిఁ జూచి మరలఁ బరుండి ఏడ్చుచుండును.)

మాధ—సురానందా ! లెమ్ము ఏడ్వకుము. కర్మానుభవమున కేడ్చుటెందులకు ?

సురా—

మ. హితవాక్యంబుల నెన్ని తెల్పినను నే ♦ నింతేని వాలింపకే
గతి ముప్పున్ గొని తెచ్చుకొంటిని యువ ♦ ఖ్యాతిన్ దలన్ దాల్చితిన్
పతితుండన్ శిరమెట్టు లెత్తఁదగుదున్ ♦ భవ్యాత్మకా ! పాపసం
గతులన్ మున్ని చరించునట్టి ఫలమున్ ♦ గంటిన్ సుమీ! నేటితో.

మాధ—తమ్ముఁడా ! విచారింపకుము, నిన్నుఁ జూచి పోవలయునని వచ్చిన యీ నీభార్యారత్నమును నొక్కతూరిఁ దల యెత్తి చూడుము.

సురా—అన్నా ! చూడఁజాలఁ జూడఁజాలను. తుచ్ఛుఁడనై పాప భీతి వర్జించి సుకుమారమైన శరీరమును బేపచువ్వలతో, వెదురు కఱ్ఱలతో, రోఁకళ్ళతో, నరచేతులతో మర్దించిన పాపాత్ముఁడను. వివాహకాలమునఁ బుట్టింటివారు పెట్టిన వస్తువులను గూడ నమ్ముచుకొని పోయినప్పుడుఁ గూడఁ బల్లెత్తు మాటాడి యెఱుంగని సుగుణలలామను బలు తెఱంగుల నేడ్పించిన క్రూరకర్ముఁడను. కాలాతీతమై యింటికిఁ జేరినను అంతవఱకుఁ గ్రుక్కెఁడు నీరమైనఁ బుచ్చుకొనక మదీయ రాకకు నిరీక్షించుచు రొసరొసలు విసవిసలు లేక సకలోపచారము లొనర్చి యాదరించిన పరమసాధ్విని గోలు పెట్టిన తుచ్ఛుఁడను. నా యీదీనావస్థను జూచి యోర్వఁజాలకఁ బుట్టింటివారు తీసికొని పోవచ్చినను నాకు భర్తతోడిదియే లోకంబుగాన నేను రానని నిర్భయంబుగ శరించి ప్రత్యుత్తర మిచ్చిన మానవతీలలామను బాధించిన ఛండాలుఁడను. ఒక్క నాఁడేని ముచ్చటికేని యొక్క చీరనేనిఁ దెచ్చుట లేకపోఁగా నీఁడు మిక్కిలి వద్దని కాళ్ళపైఁబడి ప్రాల్మాలుచుండ వెనుకకు నెట్టి పెట్టెలందునఁ గలట్టి విలువఁగల కోకల నెత్తుకొని పోయి తప్పుడైనను మొగమ్ము చూపుకొని యెఱుంగని ధర్మపత్నిని నిర్దయుండనై బండ బూతులఁ దిట్టిన చెనఁటిని. ఇంటిలో నున్న

దియుఁ లేఁదియు నొక్క నాఁడేని విచారించుట లేక పోఁగా వెళ్లు సరికి సిద్ధంబుగ నన్నంబు బెట్టలేదని చావమోద మానుష మునకు మగ్గి మాడి ఆవిధంబుగఁ గాలంబుఁ గడ పిన యర్ధాంగలక్ష్మిని యధ్వాన్న గతిని నాదరించిన యధ మాధముఁడను. ఇట్టి యకార్యంబు లొనర్చుచున్నను నాపై నీఁగవాలింతనే ప్రపంచంబు మునిఁగిపోయిన రీతిఁ బరితపించు ప్రాణేశ్వరిని పరితాపపఱచిన పాతకుఁడను. కాపురమునకు వచ్చి నది మొదలు నేటిదనుక పాటివారిలో ఫలాని వారి కోడలు గాదా యని యనిపించుకొన్న సాధ్వీలలామను సకలరీతుల రాష్ట పెట్టిన కఠినాత్ముఁడను. ఇంటికిఁ బదిమంది స్నేహితులను రప్పించి వారితోఁగూడి చెడఁద్రాగి లోపలినుండి యదియు నిదియుఁ దెమ్మన సిగ్గుపడినపుడు, ఆ దుండగీయుల మధ్యకు, ఆ తుచ్ఛుల మధ్యకు, ఆ త్రాగుబోతుల మధ్యకు నీడ్చుకొనివచ్చి మదీయ క్రోధానల తీవ్రమును జూపించుచు జుట్టుపట్టి యీడ్చుకొని వచ్చి యమ్మానవతీ లలామచే సకలోపచారములఁ జేయించి హింస పెట్టిన కలుషాత్ముఁడను. నేను త్రాగునదియే గాక నా యింతిని త్రాగుమని నిర్బంధించినపుడు "నాథా! ఇది హైందవాంగనలకు విరుద్ధ సాంప్రదాయము. సకల పాపాకరంబగు నీ దురంతకార్యమును నాచే నేలఁ జేయించెదరు, మీ పూనిక నిరాకరించినందులకు క్షమింపుఁడని" కాళ్లవ్రేళ్ళబడి ప్రాల్మాలినపుడు నిర్దయుండనై హింసించి బలవంతమున నా పతివ్రతాలలామచేఁ ద్రాగించిన మూర్ఖుఁడను. అట్టి కొంపను ఋణస్థులు వచ్చి స్వాధీన పరచుకొన్నను వచ్చి సతీమణిని సరియగు స్థితియందుంచుటకైనఁ బూనుకొనకఁ ద్రాగి తందనాల నాడుచుండుటయే గాక ఆ యింటిలో నున్నది నా సాధ్వియే యనుకొని కడకు మాంగల్యమును గూడ నూడలాగబోయి యీవిధి రవ్వఁదెచ్చుకొన్న యీ పాపాత్ముఁని

యందు దయయుంచి చూడవచ్చిన సద్గుణరాసిని సిగ్గులేక, పాప భీతిలేకఁ జూడలేకున్న కఠినుఁడను. అట్టివాఁడను అట్టి యర్థముఁ డను జేతులకు సంకెళ్ళఁ దగిలించుకొని తగుదునని యే మొగముఁ బెట్టుకొని చూతును. చూడఁజాల. చూడఁజాల.

గీ. బ్రతికియున్నను జచ్చిన ♦ వానిఁబోల్కెఁ
జూచుకొని యిట్టి ఖలుని, యీ ♦ నీచుపైని
నాశదృజియించుకొని మీర ♦ లరుగుఁడయ్యొ
సదయహృదయనునేఁ జూడఁ ♦ జాలనిటుల.

జాన—ప్రాణేశ్వరా! జరిగినదేమో జరిగినది. దానిపైకై విచారించిన లాభమేమి? మగవారైన మీరే యిక్కరణిఁ జింతింపనాడు దాన నైన నేనేరీతి ధైర్యముఁ జిక్కబట్టఁ గలను. చెప్పుఁడు.

సురా—ఓ కాంతామణీ! నన్నింకఁ బ్రాణేశ్వరా యని పిలవకుము.

గీ. పరమసాధ్వివి నీదివ్య ♦ వర్తనంబు
వెగటుగాఁదోఁచి యెప్పుడు నీ ♦ మొగము యేని
గని పలుకరించనట్టి యీ ♦ చెనటినీకు
బ్రాణనాధుండె నీపాలి ♦ యముఁడు గాక.

రవంతసేపు నీ ప్రాణేశ్వరుఁడని యే యనుకొందము. దానివలన నీకు ఫలితమేమి?

గీ. ఈపరాభవమును దాటి ♦ యింక నేను
పుడమిపైఁ గాలుపెట్టిన ♦ పృథుగదా త
దీయ ప్రాణేశ్వరుఁడొ కాదో ♦ తెలియఁగలదు
కాంత యేటికిఁ దొందఱ ♦ యంతదాక.

జాన—నాధా! అశ్లీలంబులువల్కి నన్ను మఱింత వ్యాకుల పరచుట మీకు భావ్యంబగునా.

గీ. నగలు వాకొంబులెటుపోయి ♦ నను వగవను
గృహము ఋణదాతహస్తగతైన ♦ నేడ్వఁబోను

భూములారీతిఁ బోయినఁ ♦ బొగల లేదు
మీరలు సుఖాసనుంట నే ♦ కోరుకొందు.

దేవా ! జరిగిన లోపమును మీయన్నగారు రెట్టులో తంటాలు పడి సర్దెదనని వాగ్దత్త మొనర్చియున్నారు. త్వరలో విముక్తులగు మార్గమును వారు జూతురు. కాన యింక నేని

సురా—(అర్ధోక్తిలో) దేవీ ! జరిగినదానికిఁ జచ్చినట్లు పడియుండుట మాని యింకమీఁదఁ గూడనా ? (చెంపలు వాయించుకొనుచు) అన్నా ! మాధవా ! బుద్ధివచ్చినది.

గీ. జుట్టుగొరిగించి సున్నపు ♦ బొట్టుఁబెట్టి
గాడ్దెపైనన్ను నెక్కించి ♦ గ్రామమంతఁ
ద్రిప్పుఁడారీతి నిఁకమీఁదఁ ♦ దిరుగుదేని
నన్నుఁ గాపాడుమయ్యా యో ♦ యన్న యిపుడు.

మఱియు:—

సీ. తాగఁబోయిన నింకఁ ♦ దల్లితో సాంగత్య
మొనరించినట్లిదే ♦ యొట్టు సుమ్ము
సాని సంపర్కకాం ♦ క్షను బోతినా యింక
భార్య సూత్రము తెగి ♦ పడినయట్లు
సంగ్రహణార్థము ♦ జనితినా యింకనా
చెల్లెలితోఁ బొందు ♦ చేసినట్లు
దుండగపుఁ జట్టు ♦ తోఁ గూడి పోతినా
యక్క సంపర్కమే ♦ సందినట్లు.
గాన నను నమ్మి యీయయ ♦ ఖ్యాతిఁ బాపి
నన్ను నా భార్యతోఁ జేర్చి ♦ నాకు లేని
జీవనాధార మొక్కండు ♦ జేసి మఱల
మంచివాఁ డనిపించి ర ♦ క్షించుమయ్యా.

మాధ—తమ్ముఁడా! యేటికీ యపభ్రంశపు మాటలు? భయము లేదు. కాపాడెదను.

సురా—అన్నా! మాధవరాయా!

గీ. నాడు గన్నడి హితముల • వచ్చఁజెప్ప
వినక దూరిన పల్కుల • మనమునందు
నుంచుకొనకయ్య నన్ను మ • న్నించునటులు
భారమిఁక నీదె నా నమ • స్కారమయ్య.

మాధవా! నేను వచ్చువఱకీ పతిమణి నెట్లు గాపాడుదువో.

గీ. భాగ్యములకయి యేడ్వని • యోగ్యురాలు
పరుషవాక్య మాడని యట్టి • భవ్యురాలు
నాదు యిల్లాలు దీనిసి • నాల్గునాళ్ళు
కరుణఁ గాపాడుమయ్య దుః • ఖమును మాన్పి.

మాధ—తమ్ముఁడా! పవిత్ర చరిత్రుల నెవరు గాపాడ వలయును? వారి సుగుణములఁ జూచి, వారివినయసంపదలఁ గాంచి, వారిభక్తి ప్రపత్తుల నవలోకించి, వారి ధర్మములఁ బరికించి, వారి పాలిఁట సదా భగవంతుఁడే కరుణాళుఁడై యుండఁగలఁడు. నీవు విచారపడకుము. మేము పోయివచ్చెదము.

సురా—ప్రేయసీ! వెడలెదవా?

గీ. ఈగతిఁ జగించె పతియని • నెదఁదలంచి
దుఃఖపడకు మనంబునఁ • దోయజాక్షి
అన్నగారి కంతటి కృప • యున్నయెడల
వైళమే నిన్ను కలసెదు • వాఁడ సాధ్వి.

అన్నా! ఈ అపవిత్రమగు స్థలమునందు, దోమకాటులమధ్య నిలువలేకుంటిని. చూచుటకై వచ్చిపోవుచున్న వారిమోములఁజూడఁ జాలకుంటిని. ఈ దుర్భర పరిభవానలంబున మ్రగ్గుచున్నవాఁడ నగుటఁ

జేసి నిద్రాహారంబు లెట్టివియో మఱచి యుంటిని. నన్నీ యాపద నుండి యుద్ధరించితిర యేని మఱల నీయపవిత్ర మార్గంబునఁ జొరకుండ జీవింతును. నీ పాదమాన. ఏమాత్రమును సుస్తీచేయకు సుమీ

బంట్రో—అద్గోనయ్యా ! ఘంటాయిన్నద్దావుంది ఇనస్పెక్టర్ సాప్. ఉండాడ్ మాకీ తంటాల్ తెస్తాయి పోండి, పోండి.

మాధ—తమ్ముఁడా ! నీ విబట్టలను నీవద్ద నుంచుకొనుము. ఆ మాసిన బట్టల మా కిమ్ము.

(అట్లు చేయును.)

మేమిఁక పోయి వత్తుము.

సురా—మంచిది పోయిరండు.

(అందఱు నిష్క్రమింతురు.)





శ్రీ

# సురానంద



## సప్తమాంకము.



(ప్రవేశము గురవఁడు, వెంకన్న)

గుర — యేరా! యెంకన్నా! మరి యియ్యాల కరుణంతా నీదీ నంటి యిగిందా! యింకా ఆ యెవారమే లేదా యేఁ యేందోయి కమామీసు.

వెంక — మరిసి శోలేదసీ. యింటిమకర మొక్కిపీకి పారనూకినా. ఛాత్తుర్లుగారొ కాయిఁకట్టు కెల్తా నన్నాఁడు. ఆమా రాజొత్తాఁడేమో అని యెదురు సూత్తున్నా.

గుర — యింకావున్నాయంట్రా మకరాలు

వెంక — లేవంట్రా మరి, నంజముండను పుట్టింటికాడ్కి తరిమేసినాహా? వాటిపొద్దునుంచి మనఎవారం నాచామిరంగా యెట్టావుంట మంశే అట్టావుందిరా!

గుర — యెదవ నాగన్నా! యిదేందోయ్ పెల్లాన్ని తరిమినోణ్ని నిన్నే సూసినా! యేయేలకింటికెల్లినా యింత బువ్వన్నా యెట్టదంట్రా?

(తెఱలో)

యెలిగించాలా మటము మాది ♦ రామగురుఁడు సీతారాం

జగజ్జోతి యెలిగించాలి ♦ రామగురుఁడు సితారాం

దొంగబావాజీ — (ప్రవేశించి) పిల్లలు మేకలు సల్లగుండాలి రామగు

గురు: సీతారామం.

సుర—ఏమోగోసి నీది.

బావా—జయసీతారాం. మాది యద్దరామదాసు గారి మటం.
సీతారాం భిక్షాటనం చేస్కుంటూ యిట్లా బయలుదేరుతాం.

వెంక—గురవన్నా! బావాజీలు పెళనలు చెపుతారంటారు. హాస్తం
చూస్తానంటారు. మరి యీయన కాడనుంచి కల్లువాసనొస్తుంది.
మనలాంటి యవ్వారమేనా యేంది,

గుర—ఏదో యేమత్తారుగాని ఓయి యిదిగోనయ్యోయి నీవు బావాజీ
అయితే దమ్మెత్తావా? మరి ఏమరొమ్ముకాడనుండి ఆరతికప్పొరం
కొండిహోమము, కుంకం, కనుప్పు యియున్న తీత్తావా? యెంకాసేయి
చూచి శకారిలుసెప్తావా?

బావా—రాం. రాం. ఏదో చూస్తాం మీా వ్యవహారానికిమీారుపొండి.

గుర—నువ్వూ మా బుద్ధిమంతుడల్లే వున్నావే. కద నావాతో పాటు నూ
నం తేడుద్దువు గాని. ఆకల్లుకొట్లో సేరితే యే డబ్బాయింపుమీాదన్నా
వతిరాక్కు. చంపాయించుకో వచ్చుగా.

సురా—(ప్రవేశించి తనలో) మావాళ్ళు నాకు పేరు పెట్టినందుకు
సార్థకం లేకపోతే యెట్లా! ఏటక్కు వ్యవహారం చేతనైతే నేమి
బయటపడ్డా. అంతవగలేడ్చేడ్సిం దెందులకంటే రిమాండులో వున్న
న్నాళ్ళు గుటకదిగితే వొట్టు. ఎట్లాగా అవుకుం టేదాటుకున్నాం
ఆ. చలిగూడా తీరింది. నరాల నాగయ్యా! యింకేమేమున్నావులే.
సారింది సారాలతో గుండెలు మండిపోయినాయి. బొమికలు కన
బడుతూవున్నాయి. కల్లు నీళ్లలో బడ్డావా? డబ్బుతక్కువ. వంట్లో
వున్న పుడుకురోగం పోతుందన్నారు. దాని కోసం దేవులాడుదామ
న్నా కొండబ్బుదొరక్కుండావుంది. పుండాకోరులు. యిదిమాత్రం
వూరికే యిస్తున్నారు. గిరాకీ చేశారు, మంత అణాకాని
ఈవెధవ జంఝుం కొంపదీస్తువుంది. ఎవరెక్కడ చూచి
పోతారో అని మొగాన గుడ్డడము బెట్టుకొని అటు యిటు.

ముందు వెనుక చూచుకుంటూ యేకులస్థుడైనా సరే గబగబా చేతులో వున్న రేక లాక్కోవటం. నాలుగు గుక్కలు పోసుకోడం. వుడాయించడంగావుంది. ఇన్ని యేడుపు లేడిస్తేనే గాని రోజు తెల్లారడం లేదు. కాళిదాసుగా రంతటి వాడు భార్గవుండంతటివాడు తాగేవాళ్ళట మున్ను. ఏడవలేక వ్యవసాయమని యిప్పటివాళ్ళకు బుట్టిందిదొక్కట్న. వ్యాసులవారు కల్లుగీసేవాట్ట. తెల్లవారి పాడిమొగాన మూడు ఆణాల్లి యేడిసినాగాని. యేమంత మజాగా లేదు. యెవరూ దొరికేటట్టుగూడా లేదు. ఇంటికాడ తయ్యారు రావడానికి నూ ఆవిడ మొళ్ళో పసుపుకొమ్ముమాత్రమే వున్నది. పెళ్ళంతా మొహల్లో యిక్కడ చేరారు. పిల్లేనా? గవళ్ళ గురవడు. గొల్ల వెంకడు. పిడొకడా దొంగ బాబాజీ.

(తె అ లో)

పతీయుగ నను దయచూచెదవో ♦ యినవంశోత్తమ రామా
నాతరమా భవ సాగరమీదను ♦ నలిన దళేక్షణ రామా॥

కోట—(ప్రవేశించి) శ్రీ రఘునందన సీతారమణా♦శ్రితజనపోషక రామా
కారుణ్యాలయ భక్తవరద నను ♦ కన్నది కానుపు రామా.

సూరా—ఓరి నీ ముండామొయ్య! అప్పుడే యెప్పుడు తెల్లవారిందిరా నీకు? ఎక్కడో చేశావు పద్దు.

కోట—వోరిచ్చేదేంటి? నేను జమీందారుణ్ణి, రాజుని, రాజాగేజానాను తెల్లే, శకర్తిరంగోణ్ణి. సూసోకో నాదెబ్బయితే యిసాన్యాల కవుసంతా నాదే సరే నంటావా!

సూరా—అయితే యేమంటావు.

కోట—అనేదేంటి? రా నాతో నువ్వి సిత్తుగా యేసుకుందాం.

సూరా—డబ్బులు చూపు మరి?

కోట—(నడుమున నున్న డబ్బులు కొట్టి చూపుచు) సూసుకో యింటిమీద వెంకట్కొల్లి యేలాం పాడ్తే వచ్చాయి.

సురా—పట్టపగలే.

కోట—పట్టపగలేంటయ్యా! ఏం నాయింటికి నేను దొరను కానా? వోడి పెళ్ళాంమెళ్ళో నన్నా తెంచా నంటావా! వోరింట్లో నన్నా కన్నమేచానంటావా? అదంతా మీ బామ్మల్కి సెల్లుబాటు: మొన్ననేగా మన యవారాలు జరిగాయి.

సురా—పోనీయరా! ఆగొడవెందుకు? వాళ్ళందరికీ శ్మశాన వైరాగ్యతత్వం చెప్పి దబాయించి తప్పించుకొని యివతల పడ్డాను. కాని కోటన్నా! ఆ నాలుగు నాళ్ళు మూతిముంచాను కాదే పిచ్చి యెత్తి పోయిందంటే నమ్మావు? అలవాటు కాకుండా వుండాలి గాని వదలడం చస్తేనే సుమీ? ఏమంటావు?

కోట—మఱి యిప్పుడేమంటావు? పొద్దెక్కుతోంది కల్లుకు తెల్లార డం లేదు. కల్లు దుకాణం దాకా రానిత్తారంటావా? యేయ్ యేమిః పెజ. తోట్లన్ని గుర్రుపుబళ్ళు. బయల్ దేశాని కొచ్చి నట్టుగా చెంబు లెత్తుకు రావడం, యిదంతా యెందుకయ్యా? చెట్టు మీదనుంచి కిందికి రానిత్తురా అన్నట్టుగా వుందయ్యా? చాకురు మియ్యా తాళ్ళమీద తాండవమాడు తుండాడంటే.

సురా—పట్టపగలు కల్లునీళ్ళకు రానటా? దుకాణం అంటే గవళ్ళ వరిసి మన్నెరిగుండే గనుక పైనాట కెట్లావున్న పరిసిపోతూ వున్నాయి.

గుర—వంతులాడిని ఆదొడ్డికాశ గడ్డివామికింద కూకోవెట్టి యెత్కొల్లి యిద్దారి.

సురా—మీకుగూడ తెలిసిందిరా! ఎవరితో అనమాకండరోరి!

గుర—అమ్మో అనడమే. సచ్చినా మనమాటా కాడ్డోవడమే. నాలికొక్కల్నాలిగాదూ! ఆగంగానమ్మోరు చాచ్చిగా—నీపాదాల చాచ్చిగా వోర్కి తెల్నీయను. తెలిదిందంటే నాలిక కాల్చు.

మాఁరాజా! వెంకన్నా! మరి తొందరగెల్లి చాత్తుర్లుగారినడిగి డబ్బె త్తుకురా. అసీ!

వెంక——మరి మీారంతా యిక్కడే కూకుంటారా!

సురా——ఆహాఁ!

వెంక——మరి కూకోండి. యెల్లొత్తాను, (నిష్క్రమించును)

సుర్రా——గురవఁడూ! నాకెట్లా చేరుతుందిరా!

గుర——కుండతో!

సురా——కుంతోనే? వగ లేనా?

గుర——అంతగా వొవరేనాసూత్తారంటే సిన్న గోనెముక్కడ్డం వేసుకోని మట్టుకొత్తా లెగుండి.

సురా——సరే. ఏదో యేడ్పేడుద్దాముగాని కోటప్పా! నీపాటపిని చాలా కాలమయింది. రా

కోట——మరి యింటావేంటి. సూనుకో వాతమాసా!

గురుఁడవు నీవని దైవమునీవని ♦ యురుఛాత్రంబులు రామా!
గురుదైవంబని యెఱుఁగక తిరిగేటి ♦ ఖూరుఁడనై తిని రామా!
బల్ కూరుఁడనైతిని రామా! పెద్ద ♦ కూరుడనైతిని రామా
దీ. దీ. దీ. (అని ఆట మొదలుపెట్టును.)
తాండవమున నకిలాండకోటి బెమ్మాండనాయకా రామా?
బందనమున నీనామము నమ్మిన బెమ్మానందము రామా
ఆరాములోరిపేరు తలిత్తే ఎంత బెమ్మానందముగా వుంటుందో నాలుగు ముంతలు కల్లు నీల్లోసుకుంటే అంతే ఆనందం-ఆ రామయ్య తండి మాకు పెతెచ్చంగా కనిపిత్తాఁడు. చుమా!

సురా——సరేగాని కోటప్పా! యివన్నీ అమ్ముతున్నావుగదా! తరువాత యేమిచేద్దామని నీ యూహా?

కోట——నేనా? నాకేమయ్యా! మూదిముండావోణ్ని. దిగ్గొదిల్నా, నువ్వేం చాత్తావో చెప్పుమరి సూద్దారి.

సురా—అడేలో చలేదురా!

కోట—తో చేదేంది. సదీనాం చాగిరోగితన్నారు. చరేనా? అంతేనం టావా? వొప్పుకోమరి.

సురా—అంటే చావమనేనా?

కోట—సావక సేసేదేందో చెప్పరాదంటయ్యా? నేనంటావా?

సీ. ఉన్న దూలాలమ్మి ♦ సిన్న మకరాలమ్మి
యింటిపై కప్పమ్మి ♦ యెలగ బెడుదు
యింటిలో గోమెట్టి ♦ యిటుకమ్మి పెంకమ్మి
పాటిమన్నమ్మి నే ♦ బాగు పడుదు
వంగతోలొట్టుకు ♦ గొంగూరమడియేతు
ఆటినమ్ముకొని చా ♦ పాటుసేతు!
కూలినాలిని సేసి ♦ సిలకుగడియింతు
అందులో చగము నా ♦ యాలికిత్తు
అంతగాగాకపోతె కా ♦ వ్వంత పగ
నామముల బెట్టి జోలె చం ♦ కను దగిల్చి
అరి అరాచంబోయుసి పదా ♦ లాడుకొనుచు
బయలు దేరుదునే బయుం ♦ పడనుచామి.

ఇంక నువ్వంటివా! చంగీతాలు రావు. ఛాత్రాలు రావు. వైదీకం రాదు. యేదాలు రావు. ముట్టెత్తడం రాదు పోనీ! చాత్తుర్లు గారూ! నాటకాల్లో సేరతావంటయ్యా! కాదయ్యో. దేవుడా నాటకాలంటే మాటలనుకుంటు. డానా. పొన్నోళ్ళ పాలి సూశ్నా. ఆడ గూడా వదలాడాలి. ఆటలాడాలి. బెకురు మోతు గొడ్డల్లే వుడంటాని కేలా! ఆయేచాలు. ఆబొమ్మలు. ఆ తెల్లదీపాలు. ఆదిరిసులు. యేం బాగుందయ్యో. నారేవా!

సురా—పీభార్యను పుట్టింటికంపావంటగా. సజమేనా ?

కోట—ఆముండను తగిలేచిన కాడనుంచే నాపేనం చుకంగా వుంది.

సురా—నీవదృష్టవంతుడవు గనుక సుఖపడితివి. నాభార్యను వెళ్ల మంటే వెళ్ళదు గందా!

కోట—అమ్మో! ఆ అమ్మోరేనా కదిలేది, తెల్లారి లెగిసి ఆ తల్లి మొగం సూత్తే పాపాలన్నీ నాశనమై పోవాల్సిందేగాని దామూ న్నేమూ. చాచ్చాతు పారతమ్మోరు. అన్నపూర్ణాదేవి. సేతు లెత్తి దణ్ణమెట్టాలి. ఎంత తాగుంటేనేమయ్యా! సాటునున్నా! ఎదుటనున్నా మంచికి మంచి సెబ్రితు సెబ్రి సెప్పూనుంటారుగదా! సీపాలిబెట్టపడ్డదో మహారాజా! మూనుబాపుడవు. నా యిల్లా లుండిబాబూ! ఓమాలి కోపంవచ్చి బూరుమచ్చు కెంటముడితే నీ జిమ్మదియ్యా! నీమొగాన మొద్దు లెట్టుకోమని ఢంకామీద ఫెడేల్ మని దెబ్బ కొట్టి తుర్రినెగిరిపోయింది. దాని తచ్చాగొయ్యా! మల్లీ దాని మొగం చూత్తే నీ యెడంకాలి జోడు నా మెళ్లో కట్టు. గుమ్మంలో కొత్తేనా నాచామీరంగా! షంబ షంబో యని యాగసువ్వ యీపుమీద మోగొద్దంటయ్యా!

(తెరలో వాద్యముల మ్రోత)

గుర—అదేందయ్యా! చాత్తుర్లుగారూ!

(ఒకడు వచ్చి అందరికి తలకొక కాగితమునిచ్చి పోవును.)

కోట—సూడవయ్యా. చాత్తుర్లు!

సురా—(చదువును) "మద్యపాన నిషేధమును గూర్చి చౌకులో బహిరంగసభ జరుగునుగాన నెల్లరు విచ్చేయ ప్రార్థితులు. సభాకాలము సాయంకాలము 5-30 లకు."

వెధవలు వీళ్లు చెప్పేవాళ్ళు మనం వినేవాళ్ళమునా. వీళ్ళే మనకు దొరలల్లేవుండే.

గుర—తాగొద్దంటారేందయ్యా!

సురా—అవును.

గుర—ఆళ్ల దేంబోయిందంట.

సురా—నే ననేది అదే.

గుర— యీ సబలు చాలా వాళ్లనుంచి జరుగుతుండాయి గందా వోరన్నా మానేచారా?

సుర—వీరి మాటలు లెక్కా! పత్రికా! చూసుకో. అచ్చాపీసు వెన్నకు దుకానంలో.

కోట—పోనీ ఆ రేం చెబుతారో. విందారి.

గుర—నాకూ అట్టాగే వుందిరా?

సురా—వారుచెప్పేది నే చెబుతా వినండి. ఈవద్దతంతా తప్పంటారు—తాగవద్దంటారు, శాస్త్ర చదువుకున్నవాళ్ళు గనుక చిలువలుకు పలువలు పలువలకు చిలువలు, పన్ని కథలుగా చెబుతారు. దాన్ని పూర్వపక్షం చేద్దామని నేనుగూడా కొన్నిగ్రంథాలు చూచా. శాక్తేయులంతా తాగవచ్చునన్నారు. శ్లోకాలు వ్రాశారు.

గుర—నీవీ గొడవంతా యెప్పుడు నేర్చుకున్నావంట.

సురా—ఇప్పుడు శాస్త్ర యీ వ్యవహారంలో దిగిన కాడనుంచి లేదు కాని. మా ముసలాడు బాగున్నప్పుడంతా చదువుకోవడమేగా వావని. అసలు యీ ఆధారములన్ని చూడకుండానే యిందులో దిగా ననుకున్నావా?

కోట—అట్లా అయితే ఆళ్లమాట మనకెందుకు? సిత్తుగా తాగొచ్చు నన్నమాటే.

సురా—ఆహా! పబ్లీకుగా, నడిరోడ్డుమీద. కాలుమీద కాలువేసు కొని- లొట్టెత్తి దంచొచ్చు. అడ్డంవచ్చిన వాళ్లని మెత్తగా దంచొచ్చు. మన్ని కాదనేవా రెవరు?

(వెంకన్న ప్రవేశము.)

అమ్మయ్యా! రండి. అంతారండి.

కోట—కిరుసంతా నీదేనా?

వెంక—ఆహా!

గుర—అట్లయితే మనమంతా తాగుదారి. చబకెల్దాం. ఆళ్లమాట ఇయిందాం. నచ్చుద్దా చరే వూరుకోందాం. లేకపోద్ది నాలుగురాళ్లు యిసుర్దారి. బుర్రిలు మోత మోగాలి.

సురా—అట్లా చేశామా! మన్ని యెవరునూ యేమియూ ననరు?

కోట—పోలీచాళ్ళేమనరు గందా?

సురా—అందులో వుండే వసందు చూచే వచ్చితినిగా.

కోట—అందుకనేగా! నదువుకొన్నాయన గూడా మాతో వుంటే కూసంత మంచి దెంకుకైనా! అని అనుకోడం.

గురు—అయితే పదండి మరి. పొద్దెక్కకుండా!

(అందఱు నిష్క్రమింతురు)





శ్రీ

# సురానంద



## అష్టమాంకము.

---

[ఆసుపత్రియందొక గదిలో మంచముమీఁద సురానందుఁడు కూర్చుండి ప్రవేశము].

సురా—ఒకసారి చెప్పుదెబ్బలఁ దిన్నప్పుడు తిన్నఁగా బుద్ధికలిగి యుండరాదా! ఈ దెబ్బలాట లెందులకు? ఎందు. రోగముమీఁదఁ గల్లు త్రాగితే సంజారోగం కూడా సంప్రాప్త మయినది. ఇఁక నేను బ్రతికి బయటపడే మార్గమేమీ కనుపించలేదు. ఈ ఆసుపత్రిలో నాలుగు డబ్బులుంటే తిన్నఁగా చూస్తారుగాని నావంటి వారి మొగం చూడనే చూడరు. పీళ్ళ చర్యలు బావగారి మీఁద బరాతమువలె నుండును. ఎత్తాను జన్మ, పాడుజన్మ. ఒకరిఁ సుఖపెట్టితినా? నేను సుఖపడితినా? తల్లిదండ్రులు చచ్చిరి. ఖైదులోఁ బెట్టినప్పుడే చచ్చిపోవలసిన భార్య యేదో యింకా నాలుగు దినాలు భూమిమీఁద నూకలుండఁబట్టి అంతవఱకయినా బ్రతికింది. ఏకాకి నైతిని, దరిద్రుఁడ నైతిని, రోగి నైతిని, మిత్రద్రోహి నైతిని. దేశద్రోహి నైతిని, బంధువిదూరుఁడ నైతిని. (దగ్గుచు) ఈదగ్గుతో రాత్రిం బవళ్లు నాడుంప తెగిపోతూవుంది. ఒళ్ళంతా కట్టైపోయె. పొగరుఁబోతు తనంగా రాడీ ముండవాళ్ళతో చేరి తిరిగితే పాపం యేనాటికైనా బద్దలు కాకుండా వుంటుందా! కులగోత్రాలు లేకుండా మాలవాడితో, మంగలవాడితో, యానాది వాడితో, బుడబుక్కలవాడితో, కల్లుదుకాణాల్లో చేరి తప్ప

తాగిన తుళ్ళుతులవాడిని, ఎక్కడో నరకలోకం వుందంటారు. ఇక్కడనే వుంది. ఈ శస్త్రాలేమిటి? ఈ బాధేమిటి ? పాకివాళ్లు నీళ్ళు బోస్తే తాగుతున్నానా ? నా బ్రాహ్మణీక మిట్లావుంది. ఓ పాడు మనస్సా ! కాసేపు బుద్ధిచెప్పవేఁరాదా ! పశ్చాత్తాపముఁ జెందిది ఆభగవంతుణ్ణి యిప్పుడు తలచుకొన్నా మూత్యుములో మోక్షమన్నా దొరుకుతుంది. వేసుకో ! చెంపలు వేసుకో. నీచరిత్రలో కొనికిఁ జాటు, అలవాటున్న వారిని యీచండాలపు వృత్తిని విసర్జించుమని బోధించుము.

గీ. యశము నశియించె గౌరవ ♦ మడఁగిపోయె
ఆర్యసంతతియం దప ♦ ఖ్యాతి కలిగె
ధనముక్షీణించె బలము నా ♦ శనము జెందె
రూపము హరించిపోయె నా ♦ రోగముడిగె.

గీ. గుండెలును మాడిపోయె నా ♦ యండవడియె
దుఃఖము భరింపలేక నా ♦ శోయుజాక్షి
ప్రాణములఁ గోలుపోయె నీ ♦ వరుసరోగ
పూరితుఁడనౌచు బాధలఁ ♦ బొందుచుంటి.

గీ. చేతఁగాను లేకుండుటఁ ♦ జేసినాఁడ
దొంగతనమును భటులకు ♦ లొంగినాఁడ
చేతమలమూత్రముల పాత్రి ♦ సిగ్గులేకఁ
దాల్చిమోసితిఁ జెఱనున్న ♦ తిరుణమందు.

గీ. వెలవెలందికి గోరిన ♦ విధముగానె
వ్రాసియిచ్చితి భూముల ♦ పట్టెడన్న
మునకుఁ గట్టంగగుడ్డకు ♦ మోమువాచి
బయటకుం గొట్టఁబడితి నీ ♦ వరుసఁతుదకు.

గీ. కోలుపోతిని గృహము లో ♦ కులకొసంగ
వలసిన ఋణంబు క్రిందను ♦ నిలువనీడ

లేక నల్లాడుచుంటి నీ ♦ లీలవారి
వారి పంచలఁజేరి ని ♦ ర్భాగ్యవశత.

గీ. చదివితిని మూడుభాషల ♦ శాస్త్రములను
వేదములనేర్చుకొంటి నీ ♦ విధినిబుద్ధి
మాలిఁదిరుగుట వాటిని ♦ మంటఁబెట్టి
పశువునైపోతి మెదడును ♦ పాడుపడియె.

గీ. దుండగంపు జట్టుతోఁగూడి ♦ దుష్క్రియాప
రుండనై వారివీరిని ♦ బండబూతు
లెల్లఁదిట్టి కొట్టినపను ♦ లెల్లనన్ను
కట్టిగుడుపు చున్నది ♦ యిట్టులకట.

గీ. కానజనఘోష హేతువౌ ♦ కార్యములను
దవిలిచెడిపోక సత్క్రియా ♦ దక్షులగుచు
భరతమాతకు యశముఁ గూ ♦ ర్పంగ వలయు
ఆర్యకులధర్మముల గౌర ♦ వాదులెల్ల
నిలుపవలయుఁ బ్రమోదంబు ♦ గొలుపవలయు.

[అప్పుడు కట్లగుడ్డలతోఁ గాంపౌండరు పరివార సహితుఁడై ప్రవేశించును.]

కాంపౌ—సురానందా! బాధ యెట్లున్నది?

సురా—ఎట్లున్నదని చెప్పుదును. బ్రతికినవాఁడను గాను, చచ్చిన వాఁడను గాకుంటిని. దగ్గువలన నిద్దుర పట్టుటలేదు. పుళ్ళన్నియును మంటలు పోటులుపుట్టి కూర్చుండలేను. పండుకొనలేను. నిలువఁబడలేను, నాఅవస్థ పరమాత్ముఁడే యెఱుఁగవలయును. రామ రామా!

కాంపౌ—నీనోట రామనాము వెలువడినది. ఆశ్చర్యము.

సురా—అయ్యా! నాకు వేఱుగ నరకలోక బాధలు కావలయునా?

అత్యయముఁ బొందుచుంటిని. ఏమో! ఇప్పుడైనభగవంతుని గోలు చుకొనిన నా యవస్థలఁ దప్పించునేమో అని ఆశ-

(కట్లూడఁదీసి మఱలకట్లు గట్టుచుండ బాధతో) అమ్మయ్యా! అనుచుండును.

కాంప్రా—ఇప్పుడమ్మయ్యాగా వుందా నాయనా! (అని కట్టు కట్టు చుండును.)

సురా—బాబూ! నెమ్మదిగాఁ గట్టండి. బాధకోర్వ లేకున్నాఁడను. దిక్కులేని వాఁడననియైనఁ గటాక్షించవచ్చును.

కాంప్రా—దిక్కు లేకేమి నీపూర్వులనెఱుఁగనా? నీ కర్మమున కెవ రేమి చేతురు?

సురా—కర్మముగాదా మఱి!

గీ. ధనము సర్వస్వమును వృథా ♦ త్రాగుటకును
భోగములకును వెచ్చించి ♦ రోగములను
దెచ్చుకొని యీనుపత్రికి ♦ వచ్చి యిట్టి
బాధపొందుట కర్మము ♦ భవమెనిజము.

అయ్యో, ఈనాస్థితిని జూచుకున్న జీవితముపై నాశయే నశిం చుచున్నది. అక్కడనుభవించవలసిన వెన్నియోయుండ నిక్కడఁ గూడ నేలనేడ్పింతురు. అబ్బా! దాహము. నోరు తడియారుచున్నయది.

కాంప్రా—మేమెంత చేసిన నేమి ప్రయోజనము.

(డాక్టరుగారు ప్రవేశించి)

డాక్టర్—వెల్. హౌయిజ్ పేషెన్ట్.

సురా—అయ్యో:-ఇట్లా వున్నానండి.

గీ. చావు బ్రతుకులలోన ని ♦ శ్చయము దేదొ
యెఱుఁగ లేకుండ మంచాన ♦ పొరలిదొరలి

దగ్గుచును మూల్గుచును పరా ♦ త్పరుని దయకు
నెదురు చూచుచు నున్నాఁడ ♦ నిటుల దేవ.

డాక్టర్—(రోగినిచూచి పెదవి విరచి కాంపౌడరుతో వెడలిపోవును).
సురా—(ఆయాసముగా) అయింది. సర్వమంగళ మైనది. ధనము
నకు...మానమునకు.. ప్రాణమునకు నీళ్లు వదలుకొనవచ్చును ?
మ. ధనసర్వస్వము...బాడు...చేసి—జడు నై ...

దౌర్భాగ్యునై—త్రాగుబోతును నై—దొంగను నై...
కృతఘ్ను నయి—బంధుద్రోహి నై—ప్రాణకాంతను
గోల్పోయిన పాతకుఁడనయి... నానారోగజా
లంబు-చేతను-చావంగను--సిద్ధమైన
నను రాధాకృష్ణ—గొంపోఁగ దే—:

(చెంపలు వాయించుకొని) భగవంతుఁడా ! అపరాధిని-క్షమిం
పుము. తండ్రీ ? నీకేలదయవచ్చును ? మహాద్రోహిని. ఇది మరణ
వేదన గాఁబోలును. అరుగో-యమకింకరులు. అమ్మయ్యో ! ఎంత
భీకరముగానున్నారు. వీండ్లతో అరణ్యాలులో, ముళ్లలో, పొదల్లో,
పురుగులలో, పుట్రిలలో నడిచి పోవలసిందేనా ? ఆకొండలమీద
కాళ్ళు గాలవా ? ఎత్తులుమీఁద కెక్కఁగలనా ? ఏరులు దాటవల
సిందేనా ? ఈదలేనుగందా ? నామాట వింటారా ? నామీఁదదయ
తలుస్తారా ? చేతగాదంటే వూరుకుంటారా? యమలోక శిక్షల పుస్త
కంలో తాగుబోతునకు సీసంగాచి గొంతుకలో పోయడంశిక్ష చెప్పి
నారే-వేడిగాదూ? గొంతుగాలదూ? నాయట్టి పాపాత్ముఁడికీ శిక్షకా
వల్సిందే-బ్రాందివేడి. సారావేడి. కల్లువేడి. ఇన్నివేడులు పట్టిన నా
కడుపెంతకైనఁ దగినదే—ఏమంటారు ! రమ్మంటారా? నాయన్నారా !
ఎట్లారాను ? డాక్టరుగారితో చెప్పకుండానేనా ? మాధవయ్యను
జూడకుండానేనా ? కాస్తటయిం యివ్వరాదూ ? యివ్వనంటారా ?

బాబుల్లారా ! మా అన్నయ్యను రానీయండి! ఏమన్నా యిప్పిస్తాను. లంచా లొద్దంటారా ? మీవంటి కింకరులకెందరికో యిచ్చాగా? మీ కెందుకు వద్దు ? పోనీయండి. ఆమిట్టచూపు లెందులకు ? మూలిగే నక్కమీద తాడిపండు పడ్డట్టుగా నామీద నేనా మీ పౌరుషము. ఏమంటారు ? ఆఁ, దగ్గఱకువచ్చి చెబుతారా ? అమ్మయ్యో ! దగ్గఱకు రాకండి. రానవడం లేదు. వస్తాను. గదలెత్తకండి. మొత్తకండి— (అని కనులుమూసి మఱలఁ దెఱచి ఏమిది ? ఎవరును కనుపించరే ? ఇది మరణవేదనమా ? అదుగో ! చేతులకుఁ గాళ్ళకుఁ తాళ్ళనువేసి బంధిస్తూ వున్నారు. హార ! హారా ! వెళ్ళవలసిందేనా ? ఓ భారత లోకమా !

## కీర్తన.

ముఖారి–రూపకం.

పోవుచున్నానో–పుణ్యలోకమా ? నిన్నుఁ బాసి॥ పో॥

1. జడుఁడనౌచునన్నా నీదు । కడుపునందుఁ బుట్టి యుట్టి । చెడుగులఁ జేసిన దానికి ॥ శిక్షపొందఁగ యమపురికిదె॥ పో॥
2. మదిని పశ్చాత్తాపమొంది । వదలుఁడంచు బ్రతిమాలితి । వదలము నడువుమటంచును ! గదలతో బెదరించి లాగఁగ॥ పో॥

(అని ప్రాణముల వదులును.)

(తెఱ వ్రాలును.)





శ్రీ

# సురానంద.

నవమాంకము.

---

(ప్రవేశము. మాధవరావు)

అక్కటా ! కథాంతమైనది. కథానాయకుఁ డస్తమించె. లోకమున కీకథ నీతిదాయకమై యలరాఱుఁ గాత. ఆహా ! త్రాగుడం దలవాటు పడిన వారిదురవస్థ లెంతవిపరీత స్థితిలోనున్నయవి.

మ. ధనసర్వస్వమడంగి పోవుటలు నిం ♦ దల్ గాంచుటల్ సద్యశం
బునునగ్గిన్ బడద్రోసికొంటలు కులం ♦ బున్ మట్టిపాల్సేయుటల్
జనఘోషంబున మగ్గి రోగములతో ♦ చావందుటల్ ఆసుప
త్రి[illegible]ద్వేషలమై చెలంగెడ ధా ♦ త్రిన్ మద్యపాహీలకున్,
ఓ భారతాంబా ! భారతాంబా !

భారతి—(ప్రవేశించి) ఎవ్వరీ భక్తుఁడు నన్ను స్మరించినాఁడు.

మాధ—(సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి) తల్లీ ! నీవే నమ్మా ! భారతాంబవు? నీరూపంబును గాంచి నీవే భారతాంబవని భవద్దర్శన భాగ్యంబు లభియించుటఁ జేసి పుట్టెడు దుఃఖములో నుండియు సంతసించుచున్నాఁడను.

భారత—నాయనా ! భారతీయా ! ఈనారూప మిప్పటిది గాదు.

సీ. ఏనాఁడు నాపాల ♦ నీభాగ్యంబింది దిగినదో
యానాఁడె యీరూవ ♦ మందినాను
ఏనాఁడు సారాయ ♦ మెల్లెడవెలిగెనో
యానాఁడె యీరూవ ♦ మందినాను
యేనాఁడు సుర యబ్ధి ♦ వృద్ధికిఁ గడఁగెనో
యానాఁడె యీరూవ ♦ మందినాను
యేనాఁడు నాపుత్రు ♦ లీవృత్తిఁ జేరిరో
యానాఁడె యీరూవ ♦ మందినాను
కాని నీ యట్టి పుత్రులఁ ♦ గండ్లఁజూచి
నాకయిని జాలిఁజెందిన ♦ నాటనుండి
మఱలఁ బూర్వోన్నతులు రాక ♦ మానవంచు
ధైర్యగతినున్న దానవో ♦ తనయ యిప్రుడు.

మాధ — అమ్మా ! నీవన్నది నిజము. ఇట్టి విపరీతములు జరుగుచుండుటఁ జూచి నీపుత్రు లిప్పుడిప్పుడే కన్నులు దెఱచుచుండుటయుఁ జూచుచునే యున్నాఁడను.

తల్లి:— అయినను

సీ. నిద్రరాదుగదమ్మ ♦ నీకన్నులకు దుష్ట
మద్యపానవ్యధ ♦ మాన్పవలెను
సుఖము లేదుకదమ్మ ♦ సుగుణవల్లిరో! నీకు
వ్యభిచారమిలకూలఁ ♦ బడెనువలెను
తిండిలేదుకదమ్మ ♦ దేశమాతా ! నీకు
స్వార్థత్వమును సుతుల్ ♦ వదలువలెను
శాంతిలేదుకదమ్మ ♦ స్వాంతంబునకుఁ దల్లి
కపటవృత్తులు నడ ♦ గాలువలెను




గ్రంథకర్త:- జొన్నలగడ్డ వేంకటరాధాకృష్ణయ్యగారు.

అత్యద్భుతఘటనాసంయుతంబును, ప్రేమరసతరంగితంబును ఆనందవినోదగర్భితంబును, విచిత్రకథావిలసితమును, సర్వాంగసుంద రమైన నగునీసాంఘికనవలరాజము ఆశ్చర్యమునకు నిలయము. ఆనం దమునకు గని. విస్మయమునకు సాగరమునై చదువరుల నానందసాగ రతరంగముల నోలలాడించక యుండునా? నాయికానాయకులగు మో హినీ మనోహరులచరిత్ర మత్యధికానందదాయకము. మద్యపానము వల్ల జరిగినహానియు, వేశ్యాంగనాసంపర్కమువలన గలుగుకష్టములు, దుర్మార్గస్నేహమువలన లభించుకష్టములు, పవిత్రసాధుశీలయగు అ ర్ధాంగియున్నందున గలుగులాభములు యిందభివర్ణింపబడినవి. కథా విధానమత్యద్భుతము. మనఆంధ్రభాషయం దిట్టిస్వతంత్రసాంఘికనవల యింతవరకు వెలువడియుండలేదని నిశ్చయముగా చెప్పవచ్చును. ఈ నవలరాజము నెన్నిసార్లుచదివినను తనివితీరదు; పలుమాటలేల? నేడే మాకార్యస్థానమునకు వ్రాసి మోహినీమనోహరము తెప్పించుకొని మావ్రాతల యథార్థము నరయుడు!

వెల రు 1—0—0